V. Venkatareddy. garu

A 2-3

ఓమ్.

శ్రీ గురుభ్యోనమః

సివిల్, క్రిమినల్, రివిన్యూ వ్యవహారమతలబి.

# ప్రథమ భాగము.

**1924**


KODANDARAMA LIBRARY
TELAPROLU.

ఇది

...లు, కాపులు, కరణములు, ప్రయివేట్లు, ప్లీడరుగుమా
స్తాలకు సర్వ వ్య...రములకు సర్వజనోపయోగముగా

గుంటూరుజిల్లా బ... తాలూకా, గరికపాటి గ్రామనివాసి,
గరిక... రామయ్యగారి కొమారుడు
...రావుగారి వలన రచియింపబడి


య...

శ్రీ వేమన గ్రంథాలయము,
తేలప్రోలు.

...గారు

మెస్సర్సు:—జి. సెట్టిమాధవరావు వారివలన
ప్రచురింపబడి విక్రయింపబడుచున్నది.

---

కాపీరైట్ రిజిష్టర్డు] [వెల పోస్టేజిగాక రు **1-4-0.**

# పీఠిక

ఆర్యులారా!

నే నీగ్రంథము వ్రాయ మొదలిడిన కాలమునుంచి నాకు అత్యుత్సాహముతో తోడ్పడి నాకు సహాయమొనర్చిన, నాస్నేహితులు మహారాజశ్రీ భీమవరపు రామచంద్రరావుగారికి వందనములు. యీగ్రంథము అచ్చుపూర్తి అగుకాలమునకే అనేక ఆర్డరులు మాకు వచ్చినవి గనుక యీగ్రంథము ఆంధ్రమహాజనుల ఆదరమునకు పాత్రత గాంచినదనుటలో లోపములేదు. యిందు యేమయిన పొరబాటు లుండిన రెండవ ముద్రణలో సవరించుకొనెదను. చదువరులు మన్నించ గోరుచున్నాడ.

ఇట్లు విన్నవించు సర్వజన విధేయుడు,

గరికపాటి సేతుమాధవ...

---

# శివిల్ క్రిమినల్ రివిన్యూ వ్యవహార మతలబి

ప్రథమ భాగము. (పోస్టేజిగాక రు. 1-4-0 మాత్రం)

సివిల్ 1 గ్రామపంచాయతీకోర్టులహుల్సు 2 అందు దాఖలు చేసేనోటు, వృత్తరము, వొప్పుదల, లెక్కవగయిరా కంప్లెయింట్లు మతలబులు, 3 ... జనలు, దావాల) 1 ప్రోనోటు, 2 అద్దె, 3 తాకట్టు 4 ... కున్నా, 5 అవార్డుపరిచినవృత్తము, 6 మనోవర్తి ... వేసిన భస్మము ఇది కేవ ... యా పార్టిషన్, 9 పార్టిషన్, 10 రిజష్టరీ క ... 12 ఈజిమెంటుహక్కును స్థిరపరిచుట, 13 ... నకు మంచిబలమునిచ్చును ... త్వపుహక్కును స్థిరపరిచుట. 15 రిశీవ ... తోనుబట్టి, 16 ... క్లెయింపిటిషన్, 17 క్లయింపిటీషన్, 18 ఆర్డరునువేసిన ప్రోనోటు, 19 ప్రోనోటు 20 బట్టి, 21 ఖాతా 22 వారసత్వేన సంక్రమించిన ఆస్తికి దావా, 23 బయానాశీటునుబట్టి విక్రయము చేయించమని, 24 పంచాయతీనిబట్టి డిక్రీఇప్పించమని, 25 పశువునష్టము, 26 రాజీనామా తీర్పునుబట్టి, 27 దానమును బట్టి, 28 దత్తునుబట్టి 20 ఇన్సాల్వెన్సిపిటీషన్, 30 సెటిల్‌మెంటు వగయిరా దావాలను వివిధములుగా వ్రాయునట్లు వ్రాయు మతలబులు అనేకములు గలవు.

వలయువారు:—జి. సేతుమాధవరావు, గుంటూరు.

(గ్రంథకర్త)

౮

# మెస్మరిజము

మన ఋషీశ్వరులు మానసిక శక్తి అనగా మెస్మరిజమువలననే ఆశ్చర్యభూతములగు కార్యములు చేసిన సంగతియు మానసిక శారీరక రుగ్మతలు నివారణచేసిన సంగతియు లోకమునకు విదితమేగదా! ఇప్పటికి 25 సంవత్సరములనుండి మేమీ మనశ్శక్తిని సాధనవలన యభివృద్ధి పరచుచున్నాము. ఈశక్తినే మద్రాసు గవర్నరు సర్ ఆర్థరు లాలీగారి యెదుట బ్రదర్శించి మెప్పుగాంచి యున్నాము. పలువురకు జాడ్యనివారణయందు గూడ వినియోగపరచి జయమందియున్నాము. మా యోగ్యతాపత్రములవలన ఎటువంటి జాడ్యముల నేయేతీరున నెంతెంత కాలములో నయముచేసినది తెలియగలదు. ఈ పుస్తకము మాకు వ్రాసిన యెడల ఉచితముగా బంపెదము. డాక్టర్లు వదలిన జాడ్యములు సహితము కొన్నింటిని మేమీ మెస్మరిజమువలన నయముచేసియున్నాము. మెస్మరిజమువలన రుగ్మతలు నయముచేయించుకొనగోరువారు క్రింది చిరునామాకు వ్రాయవలెను. చార్జీ వగైరాలు కేసునుబట్టి యేర్పాటు.

సి. రామారావు, మెస్మరిస్టు,
శ్రీనివాస విలాస్, గుంటూరు.


## బొటన వ్రేలిముద్రపెట్టె

నిశానిదార్లకు, ప్రయివేట్లకు, కాపులకు, కరణములకు, సర్వజన ప్రయోగము. నిశానిదార్ల చేత, యెడమచేతి వేలి ముద్ర వేయించుటకు.

వెల పోస్టేజిసహా రు. 2-0-0

జి. సేతుమాధవరావు, గుంటూరు. కు వ్రాయుడు

# దస్తావేజుల మతలబి

రెండవకూర్పు:— వెల పోస్టేజిగాక రు. 1-0-0. ఇందు 1 ముఖ్యాంశములు, 2 గమనించువిషయములు, 3 విక్రయ, 4 తాకట్టు 5 రద్దు, 6 హక్కు విడుదల, 7 తీర్మాన, 8 మరణశాసన, 9 పవర్ ఆఫ్ అట్టర్ని, 10 సెటిల్మెంటు; 11 ఫిరాయింపు 12 దాన, 13 దత్తత, 14 కవులు కబోలియ్యతు, 15 ఖరారునామా, 16 ట్రాన్సుఫరు, 17 సవరణ, 18 హామి, 19 మనవర్తి 20 ఫారిఖత్తు, 21 రిజిష్టరేషనుఆక్టు, 22 స్టాంపు డ్యూటీ, గలవు.

వ.రా:—ఒక్కొక్కరకము దస్తావేజునకు అనేకములుగా మతిలబులు గలవు. దస్తావేజులు వ్రాయుట చాలాకాలము నిపుణులయినవారుసహా దీనిలోని హంశములను గమనించుచున్నారు.

వలయువారు:—జి. సేతుమాధవరావు, గుంటూరు.
(అని వ్రాయుడు)

---

## స్వర్ణరజతము తులం 1కి రు. 3

ఇది బంగారమును వెండియును కలిపి
లము మూలికలవల్ల చేయబడ్డది. ఇదిదేహము
మిక్కిలి వీర్యపుష్టినిచ్చును. వీర్యము పలుచబడు యెడల
లోనే మంచిగుణము నిచ్చును. జిరించిన శగరోగము, సవాయి మూలవ్యాధి, దీర్ఘజ్వరము, నెత్తురుచచ్చు పాలిపోవుట, మాంద్యము, అజీర్ణము, క్షయ, వాతకలకలు, చిరకాలముండి నోటిపూత; అతిమూత్రము; సమస్త మేహజాడ్యములు నయముగ నొదడును శుభ్రపరచును. రసవిషగంధక సమ్మేళనములేదు.

☞ యమ్. రామారావు, మెస్సర్సు,
శ్రీనివాస విలాస్, గుంటూరు.

1

# సివిల్

## [గ్రామపంచాయతి కోర్టుల రూల్సు.]

## మద్రాసుగ్రామకోర్టుల ఆక్టు 1 వ అధ్యాయము.

### ప్రథమాంశములు.

సంగ్రహనామమున్ను ప్రారంభమున్ను.— 1. (1) ఈ ఆక్టును 1888 వ సంవత్సరపు మదరాసు గ్రామకోర్టుల ఆక్టు అని చెప్పవచ్చును, మరిన్ని యిది తక్షణము అమలులోకి రావలసినది. [a]

[ప్రదేశవ్యాప్తి.]— (2) ఈ ఆక్టు 1874 వ సంవత్సరపు 14 వ ఆక్టులో [b] నిర్దేశించివున్న ప్రకారము షట్యూల్లోచేరిన డిస్ట్రిక్టులున్ను మదరాసు పట్టణమున్ను తప్ప, ఆలోచన సభలోని ఫోర్టుసెయింట్ జార్జి ప్రెసిడెన్సీ గవర్నరుగారికి ఆయాకాలములయందు లోబడివున్న దేశములకు వ్యాపించును. అయితే ఆలోచన సభలోని గవర్నరుగారు ఫోర్టు సెయింట్ జార్జి గెజటులో ప్రకటన మూలముగా యేదయిన గ్రామమునుగాని విస్తీర్ణమునుగాని యీ ఆక్టుయొక్క వ్యాప్తిలోనుండి అప్పటప్పటికి తీసివేసి అట్టి ప్రకటనను రద్దుచేయవచ్చును.

[రద్దుచెయ్యబడ్డ చట్టములు.]— 2. 1901 వ సంవత్సరపు 11 వ దగు 1901 వ సంవత్సరపు రద్దుపరచునట్టిన్ని సవరించునట్టిన్ని ఆక్టుయొక్క సెక్షను 3 (2) చే రద్దు చేయుబడినది.

[జరుగుతూవున్న వ్యాజ్యములను, లేక డిక్రీలను ఆక్టు వర్తించడము.]— 3. ఈ ఆక్టు అమలులోకి వచ్చేకాలమందు గ్రామమునసబుల కోర్టులలో జరుగుతూవుండే అన్ని వ్యాజ్యములు యీ ఆక్టు ప్రకారము తేబడ్డట్లు యెంచబడవలసినది. మరియు ఆ తారీఖుకు ముందు గ్రామమునసబులవల్ల చెయ్యబడ్డ అన్నిడిక్రీలున్ను యీ ఆక్టును అనుసరించి చెయ్యబడ్డ డిక్రీలను అమలు నెరవేర్చడమునుగురించి యిందులో యీ దిగువ చెప్పియున్న నిబాధలనుబట్టి అమలు నెరవేర్చబడవచ్చును.

[ఆక్టుయొక్క వ్యాప్తిలోనుండి తీసివేయబడ్డ విస్తీర్ణములో జరుగుతూవున్న వ్యాజ్యములకున్ను డిక్రీలకున్ను చర్య.]— 4. ఏ గ్రామమైనను విస్తీర్ణమైనను యీ ఆక్టుయొక్క వాప్తిలోనుండి తీసివేయబడేయెడల, అందులోవుండే గ్రామకోర్టులో జరుగుతూవున్న అన్ని వ్యాజ్యములున్ను అట్టి కోర్టువారివల్ల చెయ్యబడి అమలు నెరవేర్చబడకుండావున్న అన్ని డిక్రీలున్ను, ఆ వ్యాజ్యము అప్పుడే వేయబడేటట్టు వున్నయెడల దాని విమర్శించుటకు అధికారముగల సివిల్ కోర్టువారివల్ల విమర్శించబడి తీర్మానించబడవలసినదేగాక అమలు నెరవేర్చబడవలసినది.

[అర్థమును తెలియచేసే క్లాజు.]— అట్టి వ్యాజ్యములు ఆ సివిల్ కోర్టులో వేయబడ్డ వ్యాజ్యములవలె విమర్శించబడి, అట్టి డిక్రీలు ఆ సివిల్ కోర్టువారివల్ల చెయ్యబడ్డ డిక్రీలవలె అమలు నెరవేర్చబడవలసినది.

[గ్రామము.]— 5 ఈ ఆక్టులో విషయమందుగాని సందర్భమందుగాని విరోధము యేమిన్ని లేనియెడల—"గ్రామము" అను మాటకు, శాశ్వత ఫైసలాయతీ ఎస్టేటులో, దేనికిగాను యీ ఆక్టు జారీ అయ్యేటప్పుడు 1816 సంవత్సరపు మదరాసు 4 వ రిగ్యులేషను [a]బట్టి గ్రామమునసబుకోర్టు యేర్పరచబడివున్నదో, లేక దేనికిగాను యీ ఆక్టు ప్రకారం గ్రామకోర్టు స్థాపించబడివున్నదో అట్టి ప్రదేశవిస్తీర్ణమున్ను యితర స్థలములయందు భూమి శిస్తు వసూలుచేసే కార్యములకుగాను గ్రామముగావుండేటట్టు అప్పుడప్పుడు గవర్నమెంటువారు అంగీకరించే ప్రదేశవిస్తీర్ణమున్ను అర్థమవుతున్నది.

[గ్రామకోర్టు.]— [b] "గ్రామకోర్టు" అను మాటలకు 7 వ సెక్షను ననుసరించి నియమింపబడిన గ్రామ మునసబుయొక్క కోర్టు అని లేదా 9 వ సెక్షను ననుసరించి స్థాపింపబడిన పంచాయతీ కోర్టు అని యర్థము.

[గ్రామమునసబు.]— [b] "గ్రామమునసబు" అను మాటలకు ఈ యాక్టు ననుసరించి స్థాపింపబడిన ఒక గ్రామ మునసబు కోర్టుయొక్క జడ్జి (న్యాయాధిపతి) అని అర్థము. మరియు 7 వ, 16 వ

సెక్షనులో తప్ప ఆ మాటలలో ఒక పంచాయతీ కోర్టుయొక్క ప్రెసిడెంటు (అగ్రాసనాధిపతి) చేరును.

[డిస్ట్రిక్టుమునసబు.]— [b] "డిస్ట్రిక్టు మునసబు" అను మాటలకు ఆగ్రామకోర్టు ఎవరి అధికార ప్రదేశహద్దులకు లోపలనున్నదో ఆ డిస్ట్రిక్టుమునసబు అని యర్థము. కాని, ఆగ్రామము ఏడిస్ట్రిక్టు మునసబుయొక్కగాని అధికారప్రదేశ హద్దుల లోపలనుండనియెడల, ఎవరి అధికార ప్రదేశహద్దులలోపల ఆ గ్రామము ఉన్నదో ఆ సబార్డినేటుజడ్జి, లేదా, సబార్డినేటుజడ్జి యెవరును లేనియెడల ఎవరి అధికార ప్రదేశ హద్దులలోపల ఆ గ్రామము ఉన్నదో ఆ డిస్ట్రిక్టు జడ్జి, డిస్ట్రిక్టు మునసబుగా భావింప బడవలెను.

ఇదిగాక, యే ప్రదేశమునందైనను డిస్ట్రిక్టు మునసబు స్మాలు కాజు విచారణాధికారము చెలాయించకుండ, ఒక ప్రత్యేకమైన స్మాలు కాజుల కోర్టు స్థాపింపబడియుండునెడల అట్టి కోర్టుయొక్క జడ్జి డిస్ట్రిక్టు మునసబుగా భావింపబడవలెను.

[నిర్దేశింపబడిన.]— [c] "నిర్దేశింపబడిన" అను మాటకు ఈ యాక్టు ననుసరించి ఆలోచనసభతోకూడిన గవర్నరుగారిచే చేయబడిన విధిచే నిర్దేశింపబడిన అని యర్థము.

[సంతకముచేయు.]— [a] "సంతకముచేయు" అను మాటయొక్క వ్యాకరణసంబంధపు రూపభేదములతోడను ఆదేవ్యుత్పత్తిగల పదములతోడను, ఆ మాటలో, తనపేరును వ్రాయుటకు అశక్తుడయియుండు మనిషి విషయములో, 'నిశానీ' యను నదియును దాని వ్యాకరణసంబంధపు రూపభేదములును అదే వ్యుత్పత్తిగల పదములును చేరవలెను.

## 2 వ అధ్యాయము.

### గ్రామకోర్టులను స్థాపించడమున్ను యేర్పాటు చెయ్యడమున్ను.

[గ్రామకోర్టులు స్థాపించడము.]— 6. ఆలోచన సభలోని గవర్నరుగారు డిస్ట్రిక్టు గెజటులో ప్రచురించబడు ఉత్తరువు ద్వారా అప్పటప్పటికి—

(1) రెండు, లేక యెక్కువగ్రామములు నొకటిగాచేర్చి అందులో పూర్వము వుంటూవుండిన అయా గ్రామకోర్టులకు బదులు వాటికి యొక గ్రామకోర్టు స్థాపింపవచ్చును;

(2) ఏ గ్రామముంనైనా డివిజనులు యేర్పాటుచేసి అట్టి గ్రామమందు పూర్వము వుంటూవుండిన గ్రామకోర్టుకు బదులు అట్టి డివిజనలలో నొక్కొకదానికి ప్రత్యేక గ్రామకోర్టు స్థాపింపవచ్చును;

(3) నిర్దేశించిన యేదైనా విస్తీర్ణమునకుగాను క్రొత్త గ్రామకోర్టు స్థాపింపవచ్చును. [b]

[గ్రామమునసబును నియమించటము.]— 7. [c] పంచాయతీ కోర్టులు ఏవియు లేని గ్రామములలో [c] నిర్దేశింపబడిన విధముగా [d] గ్రామ మునసబులు [d] కలెక్టరువల్ల నియమించబడవలసినది; అయితే గ్రామములోగా వాసముచేస్తూవుండని యే మనిషిన్ని ఆ వుద్యోగమునకు అర్హుడుకాడు.

[గ్రామమునసబును సస్పెండు చేయడము లేక తోసివెయ్యడము.]— 8. డిస్ట్రిక్టు కలెక్టరు గ్రామమునసబును [e] గాని పంచాయతీ కోర్టు తాలూకు ఒక మెంబరుగాని [e] అసమర్థత, పనిలోఅశ్రద్ధ, దుర్నడత లేక తగుబాటి న్యాయమైన యితరకారణమువల్ల సస్పెండు (కొన్నాళ్ళవరకు పనిలోనుండి నిలిపివుంచవచ్చును) చెయ్యవచ్చును, లేక తోసివేయవచ్చును, మరిన్ని గ్రామకోర్టు [f] జరిగించే న్యాయవిచారణ సంబంధమైన చర్యలవల్ల [f] తెలియవచ్చే అట్టి కారణమునకుగాను డిస్ట్రిక్టు జడ్జి హుకుం జారిచేసేయెడల దానిపైని కలెక్టరు ఆగ్రామమునసబునుగాని మెంబరునుగాని సస్పెండు చెయ్యవలసినది, లేక తోసివేయవలసినది.

[g] సస్పెండు చేయుటకయిన లేదా తీసివేయుటకయిన [g] ప్రతివుత్తరువుమీద ఆ వుత్తరువు డిస్ట్రిక్టు జడ్జి వద్దనుండి హుకుముమీదకాకుండా కలెక్టరువల్లనే చెయ్యబడ్డయెడల రివిన్యూ బోర్డువారికిగాని డిస్ట్రిక్టు జడ్జియొక్క హుకుములమీద చెయ్యబడ్డయెడల హైకోర్టువారికిగాని మూడుమాసములలోగా అప్పీలు చేసుకోబడవచ్చును, అట్టి అన్ని అప్పీళ్ళమీద ఆయాసంగతికి తగ్గట్లు రివిన్యూ బోర్డువార

యినను హైకోర్టువారయినను చేసే తీర్పు ఆఖరుదిగా వుండవలసినది.

[పంచాయతీ కోర్టుల నిర్మాణము.]— [a] 9. (1) ఏదేని గ్రామమునకుగాని, గ్రామముల సమూహమునకుగాని, గ్రామభాగమునకుగాని, ఇందు నిటుతరువాత నిబంధింపబడియున్న విధముగా ఒక పంచాయతీ కోర్టును, ఆలోచన సభతోకూడిన గవర్నరుగారు డిస్ట్రిక్టు గెజటులో ప్రకటింపబడు ఉత్తరువు మూలకముగా, ఏర్పాటుచేయవచ్చును. అందువిూదట 7 వ సెక్షను ననుసరించి నియమింపబడు గ్రామమునసబుయొక్క కోర్టు ఏదిగాని అట్టి ప్రదేశములో నేభాగమునందయినను ఈ యాక్టు ననుసరించి విచారణాధికారమును చెలాయించగూడదు.

(2) అట్లు స్థాపింపబడిన ప్రతి కోర్టుకును మెంబర్ల సంఖ్యను కలెక్టరు నిర్ణయించవలెను, కాని అట్టి సంఖ్య అయిదుకంటె తక్కువగాని పండ్రెండుకంటె ఎక్కువగాని అయియుండగూడదు;

(3) ఆలోచన సభతోకూడిన గవర్నరుగారిచే చేయబడునట్టి విధులకు లోబడి, పంచాయతీ కోర్టు మెంబర్లు ఎలెక్షను మూలకముగా నియమింపబడవలెను.

[మెంబర్ల ఉద్యోగకాలము.]— (4) ఆలోచన సభతో కూడిన గవర్నరుగారిచే చేయబడునట్టి విధులకు లోబడి ఒక పంచాయతీ కోర్టులోని మెంబరు మూడు సంవత్సరముల కాలమువరకు ఉద్యోగమును వహించియుండవలెను.

[ప్రెసిడెంటును ఎలెక్టుచేయుట.]— (5) ఒక పంచాయతీ కోర్టువారు తమ మెంబర్లలో నొకరిని, నిర్దేశింపబడిన విధుల ప్రకారము తమ ప్రెసిడెంటుగా నుండుటకు ఎలెక్టుచేయవలెను.

ప్రెసిడెంటు లేని సందర్భములలో హాజరయియుండి కోర్టుగా ఏర్పడియుండు మెంబర్లు అప్పుడుకూడిన సభయొక్క కార్యములకుగాను తమలోనుండే ఒక ప్రెసిడెంటును ఎలెక్టు చేయవలెను

[కోరము.]— (6) పంచాయతీ కోర్టులో ముగ్గురు మెంబర్లు కోరము (సభజరుపుటకు కనీసము ఉండవలసిన సంఖ్య) గా నేర్పడవలెను. మరియు హాజరయి యుండువారిలో అధిక సంఖ్యాకుల

తీర్మానము కోర్టువారి తీర్పుఅయియుండును.

కాని వోట్లు సమాన సంఖ్యగానుండు సందర్భములో ప్రెసిడెంటుకు తీర్మానపువోటు ఉండవలెను.

[పంచాయతీ కోర్టులను తీసివేయుటకు లోకలు గవర్నమెంటు వారికి గల యధికారము.]— (7) ఆలోచన సభతోకూడిన గవర్నరుగారు డిస్ట్రిక్టు గెజటులో ప్రకటింపబడు ఉత్తరువుద్వారా ఏపంచాయతీ కోర్టు నైనను తీసివేయవచ్చును.

[వ్యాజ్యముల రిజస్టరున్ను చర్యల రికార్డున్ను వుంచడమందు గ్రామకరణము మునసబుకు సహాయము చేయవలసినది.]—
10. గ్రామ మునసబు గ్రామకోర్టులో వేసిన వ్యాజ్యములకు రిజస్టరు వుంచి కోర్టుచర్యలను వ్రాయవలసినది, వుత్తరువు చెయ్యబడివున్న పక్షమునకు, అట్టి రిజస్టరు వుంచడములోనున్ను కోర్టుచర్యలు వ్రాయడములోనున్ను సహాయము చెయ్యడము గ్రామకరణముయొక్క పనిగా వుండవలసినది.

[గ్రామనవుకరు సమ్మన్లవగైరాలను అంద చెయ్యవలసినది.—
11. ఈ ఆక్టుప్రకారము జారీచెయ్యబడు దరోబస్తు సమ్మన్లు—నోటీసులు—హుకుములు—వీటిని అందచెయ్యడమున్ను యీ ఆక్టును అనుసరించి జప్తు చెయ్యబడ్డ చరాస్తిని పట్టుకొని విక్రయించి అప్పగింత చెయ్యడములో గ్రామమునసబుయొక్క వుత్తరువులప్రకారము ప్రవర్తించడమున్ను సమాచారములు పట్టించుకొనిపోవడమందు వాడుకగా పనిలో వుంచబడ్డ గ్రామ నవుకరుయొక్క పనిగా వుండవలసినది.

(గ్రామకరణమునకున్ను గ్రామనవుకరుకున్ను బదులుగాగాని వార్లతోటిగాని యేమనిషినైనా కలెక్టరు నియమించవచ్చును.)—

12. వరుసగా 10, 11 సెక్షన్లవల్ల నిర్ణయించివున్న పనులు నెరవేర్చుటకుగాను గ్రామకరణము, లేక 11 వ సెక్షనులో చెప్పివుండె గ్రామనవుకరుకు బదులుగాగాని అతనితోటిగాని యే మనిషినైనా నియమించడమునకు, ఆలోచనసభలోని గవర్నరుగారి పైవిచారణకు లోబడి, డిస్ట్రిక్టు కలెక్టరుకు అధికారము వుండవలసినది.

## 3 వ అధ్యాయము.

## అధికారహద్దున్ను ముందే తీర్పుచేయబడివున్న విషయమున్ను కాలనిర్ణయమున్ను.

[గ్రామకోర్టులవారు వ్యాజ్యములు విచారణచెయ్యడము.]—

13. ఈ దిగువ కనుపరచివుండేవి గ్రామకోర్టులవారివల్ల విచారించబడతగ్గ వ్యాజ్యములు (అవేవనగా)—ఋణము, లేక దావా, లెక్క బాకీమీదుగానైనాసరే మరియొకవిధముగానైనాసరే మొత్తము, లేదా విలువలో ఏబది [a] రూపాయలకు మించనియెడల, ఖరారుమీద బాకీగావున్న పైకమునకుగాని చరాస్తికిగాని అట్టి ఆస్తియొక్క విలువకుగాని తేబడు దావాలు.

[నిబంధన.]— అయితే యేదయినా అట్టి కోర్టులో

(1) పాలికాపుతనపు లెక్కలో బాకీ యింతమాత్రమని అందులో సంబంధపడ్డ నఫర్లుగాని వారి ఏజంట్లుగాని తీర్చితేనే తప్ప లేనిపట్ల ఆ బాకీకిగాను;

(2) మరణశాసనము వ్రాయకుండా చనిపోయినసంగతిలో భాగమునకు, లేక భాగములో కొంతమట్టుకు, లేక మరణశాసనప్రకారము యేర్పాటైన ఆస్తికి, లేదా అందుల భాగమునకుగాను;

(3) భూమికిగాను చెల్లించతగ్గ గుత్తమొత్తము ప్రతివాది సంతకముచేసిన లిఖితమూలమయిన ఖరారుమీద బాకీగా వుంటేనేతప్ప, ఆ గుత్తమొత్తమునకుగాను;

(4) గవరన్మెంటువారివల్ల, లేక వారిమీద, లేదా వుద్యోగధర్మమందు సర్కారు వుద్యోగస్తులవల్ల, లేక వారిమీద;

(5) మైనర్లు, లేక చిత్తస్వాస్థ్యము లేనివారివల్ల, లేక వారిమీద, వ్యాజ్యము తేబడకూడదు,

[సమ్మతితోటి 200 రూపాయలవరకు విచారణాధికారహద్దు.]—

14. కోర్టువారియెదుట వ్రాయబడ్డ వుభయకక్షిదార్ల లిఖితమూలమయిన సమ్మతితోటి గ్రామకోర్టువారు 13 వ సెక్షనులో వివరించివున్న స్వభావముగల వ్యాజ్యముల మొత్తముగాని విలువగాని 200 రూపాయలకు మించనియెడల అట్టివ్యాజ్యములను విమర్శించి

తీర్మానించవచ్చును.

[వ్యాజ్యము వేయబడ వలసిన కోర్టు.]— 15. 16 వ సెక్షనులో చెప్పియున్న నిబంధనలకులోబడి, యీ ఆక్టుప్రకారము తేబడు ప్రతివ్యాజ్యము— వ్యాజ్య ప్రారంభ కాలమందు ప్రతివాదులు అందరున్ను యెవరి అధికార ప్రదేశహద్దులకు లోపుగా వాసముచేస్తున్నారో, వ్యాపారము జరిపిస్తున్నారో, లేదా లాభమునకుగాను స్వయముగా పనిచేస్తున్నారో ఆ గ్రామకోర్టులో [b] వేయబడవలసినది.

[గ్రామమునసబు స్వయముగా సంబంధము కలిగివున్న వ్యాజ్యము.]— [a] 16. (1) దేనికి, లేక యెందులో గ్రామమునసబు కక్షిదారుడుగావున్నాడో, లేదా స్వయముగా సంబంధము కలిగివున్నాడో అట్టి యేవ్యాజ్యమునైనను అతడు విమర్శించనూకూడదు, లేక అట్టి వ్యాజ్యములో చేరిన, లేక అందువల్ల కలిగిన యేదయినా చర్యవిషయమై తీర్పుచెప్పనూకూడదు. అట్టి ప్రతివ్యాజ్యముగాని చర్యగాని అవ్యవహితముగా సమీపమందున్న యేదయినా గ్రామకోర్టులో [b] వేయబడవచ్చును.

[ఒక మెంబరు స్వయముగా సంబంధము కలిగివున్న వ్యాజ్యము.]— (2) ఒక పంచాయతీ కోర్టుయొక్క మెంబరు ఎవరయినను అట్టి కోర్టుయెదుట గల యేవ్యాజ్యములోగాని చర్యలోగాని ఒక పార్టీ అయియుండినా స్వయముగా బాధ్యత గలిగియుండినా, అట్టి వ్యాజ్యమునో చర్యనో విచారించు సమయమందు అతడు కోర్టునుండి వెళ్ళిపోవలెను, మఱియు దాని తీర్మానములో అతడుయే జోక్యమును పుచ్చుకోగూడదు.

[ముందే తీర్పుచెయ్యబడివున్న విషయము.]— 17. అదే కక్షిదార్లలో, లేక వారు యెవరనుకొని దావాచేస్తున్నారో వారిలో, పూర్వపు వ్యాజ్యమందు తగిన అధికారముగల కోర్టువారివల్ల విచారించబడి తీర్చబడ్డ వ్యాజ్యకారణవిషయమై అట్లా మళ్లీ తేబడు యేదయినా వ్యాజ్యమును గ్రామకోర్టువారు విమర్శించకూడదు.

[వ్యాజ్యములో దావాయావత్తు చేరివుండవలసినది.]— 18. ఒక గ్రామకోర్టులో వేయబడు ప్రతివ్యాజ్యమందు వ్యాజ్యకారణ

విషయమై చేయుటకువాదికి బాధ్యతగలమూవత్తు దావాచేసియుండవల సినది, అయితే అట్టికోర్టు యొక్క అధికారహద్దులకులోగా వ్యాజ్యము తెచ్చేనిమిత్తము తన దావాయొక్క యే భాగమయినా అతడు మానుకొనవచ్చును.

[దావాలో కొంతభాగమును మానుకోవడము.] వాది తన దావాలో ఏ భాగమునుగురించి అయినను వ్యాజ్యము వేయకుండా తప్పిపోయిన యెడల, లేక బుద్ధిపూర్వకముగా మానుకొన్న యెడల అట్లా తప్పిపోయిన, లేదా మానుకొన్న భాగమునకుగాని అందునుగు రించిగాని అతడు కొత్తవ్యాజ్యము తేకూడదు.

[గ్రామకోర్టువారివల్ల విమర్శించబడతగని విషయములను మధ్య తీర్మానము చెయ్యడము.]— 19. [c] గ్రామకోర్టువారి వల్ల విమర్శించబడతగ్గ వ్యాజ్యమును తీర్మానించడములో, అవ్యాజ్యపు కక్షిదార్లలో స్థిరాస్తికిగల హక్కునుగురించిగాని వారిలో యెవరి యొక్క అయినా, లేదా యెవరనుకొని వారు దావాచేస్తున్నారో వారి యొక్క అయినా న్యాయశాస్త్ర సమ్మతమయిన హెూదానుగురించి గాని యేదైనా కరారు, లేక విధాయకము యేర్పడి వుండడముగురిం చిగాని వివాదముకలిగివుండే యే విషయము ఆ వ్యాజ్యమునకు ప్రత్య క్షఅంశముగా వున్నపట్ల గ్రామకోర్టువారివల్ల యీ ఆక్టను అనుసరించి విమర్శించ బడతగ్గది కాదో అట్టి యేసంగతిని అయినా మధ్య తీర్మా నించడము అవశ్యకముగావున్నయెడల, అట్టి వ్యాజ్యమును తీర్మానించ డమునకుగాను యెంతమట్టుకు జరూరుగా వుండవచ్చునో అంతమట్టుకు, హక్కు, న్యాయశాస్త్రసమ్మతమైన హెూదా, కరారు, లేదా విధా యకము యేర్పడివుండడమునుగురించి కలిగే అట్టి వివాదము తీర్మా నించడమునకు గ్రామకోర్టువారికి అధికారము కలిగివుండవలసినది, అయితే ఆ తీర్మానము అనేది అదే కక్షిదార్లలోగాని వారి ప్రతినిధు లలోగాని యేదయినా యితర వ్యాజ్యము తేబడినా ఆ వ్యాజ్యమందు అట్టి హక్కు, న్యాయశాస్త్రసమ్మతమైన హెూదా, ఖరారు, లేక విధాయకమునుగురించి నిదర్శనముగా యెత్తుకోకూడదు.

[కాలనిర్ణయము.]— 20. [a] 1877 వ సంవత్సరమందు

పుట్టిన ఇండియా దేశపు కాలనిర్ణయ ఆక్టుయొక్క నిబంధనలు యీ ఆక్టును అనుసరించిన వ్యాజ్యములకున్ను దరఖాస్తులకున్ను సంబంధపడవలసినది. [b]

[గ్రామకోర్టుచే విచారింపబడదగు వ్యాజ్యములు.]—

20—A. [c] (1) ఒక గ్రామకోర్టుచే విచారింపబడదగు వ్యాజ్యము ఒక డిస్ట్రిక్టు మునసబ్ యొక్క కోర్టులో దాఖలుచేయబడు నెడల, ఆయన ముందుకు భిన్నముగా చాలినంత కారణములుండిననే తప్ప దానిని గ్రామకోర్టుకు ట్రాన్స్ఫరు చేయవచ్చును.

[డిస్ట్రిక్టు మునసబు విచారించు వ్యాజ్యముల కర్చులు.]—

(2) ఒక గ్రామకోర్టుచే విచారింపబడదగు వ్యాజ్యమును ఒక డిస్ట్రిక్టు మునసబ్ విచారించునెడల మరియు ఆ వ్యాజ్యము గ్రామకోర్టులో దాఖలు చేయబడవలసియుండెనని ఆయన అభిప్రాయుడైనయెడల విజయముపొందిన వాదికి కర్చులు ఏమియు అనుమతింపబడగూడదు. మరియు జయము పొందిన ప్రతివాదికి ప్లీడరు క్లయెంటు సంబంధపు కర్చులు అనుమతింప బడవలెను.

[వ్యాజ్యములను ట్రాన్స్ఫర్ చెయ్యడము.]— 21. [d] (1) డిస్ట్రిక్టు మునసబు—కక్షిదార్లలో యెవరయినను దరఖాస్తు చేసుకొన్న మీదట, గ్రామ కోర్టులోనుండి యే వ్యాజ్యమునైనను తెప్పించుకొని ఆ వ్యాజ్యము తమ కోర్టులో వేసివుంటే యెట్లాగో అట్లాగే దాన్ని తామే విమర్శ చెయ్యవచ్చును. లేక తమ ప్రదేశాధికారహద్దులకు లోపుగావున్న యేదయినా యితర గ్రామ కోర్టుకు విమర్శ నిమిత్తము దాన్ని ట్రాన్స్ఫర్ చెయ్యవచ్చును, అయితే ఒక వ్యాజ్యమును గ్రామ కోర్టులోనుండి తెప్పించుకొని అది డిస్ట్రిక్టు మునసబు వల్ల విమర్శించబడుటకు గాను దరఖాస్తు చేసుకొనే యే కక్షిదారుడైనను, యేదయినా అట్టి ట్రాన్స్ఫర్ వుత్తరువు చేయుటకుముందు, [e] 1870 వ సంవత్సరపు కోర్టు ఫీజు ఆక్టుప్రకారము అందుకుగాను కట్టబడతగ్గ ఫీజు మొత్తము చెల్లించవలసినది.

[డిస్ట్రిక్టు మునసబు చర్యలను నిలిపిపెట్టుట.]— (2) (1) వ సబ్ సెక్షను ననుసరించి యేదేని దరఖాస్తు పరిష్కరింపబడుటను

నిరీక్షించుచు గ్రామ కోర్టులోని చర్యలను నిలిపి పెట్టవలసినదని డిస్ట్రిక్టు మునసబు ఉత్తరువుచేయవచ్చును.

4 వ అధ్యాయము.

వ్యాజ్యములు తేవడము, తయారుచెయ్యడము, అధికారముపొందిన ఏజెంట్లు, కక్షిదార్లకు సమ్మన్లు జారీచేసి అందచెయ్యడము, విచారణ నిలిపివుంచడము, వారు హాజరు కాకపోవడమువల్ల కలిగిన ఫలితములు, వీటినిగురించి.

[ప్లెయింటుమూలముగా వ్యాజ్యము ఆరంభించబడవలసినది.]—

22. ఈ ఆక్టు ప్రకారము తేబడు ప్రతివ్యాజ్యమునున్ను గ్రామ మునసబువద్ద ప్లెయింటుయిచ్చి ఆమూలముగా ప్రారంభించబడవలసినది, పైగా ప్రతివాదులు యెందరు వున్నారో అన్ని ప్లెయింటుప్రతులు కూడా యివ్వవలసినది. సమ్మను ప్రతితోకూడా ప్లెయింటు ప్రతివొకటి యిందులో యీ దిగువ నిబంధన కలుగచేసినప్రకారము అప్పగించబడవలసినది, లేక అంటించబడవలసినది.

[వివరములు ప్లెయింటులో వుండవలసినది.]— 23. గ్రామములో వ్యవహరించబడు భాషలో ప్లెయింటువ్రాసి అందులో వాదిగాని అతడు లేనిపక్షమందు అతనివల్ల క్రమప్రకారము అధికారము కలుగచేయబడ్డ ఏజెంటుగాని సంతకముచేయవలసినదేగాక అందులో యీదిగువ కనపరచివుండే వివరములు వుండవలసినది:—

[a] వాది ప్రతివాదుల పేర్లు—వివరము—వాసస్థలము,

[b] వ్యాజ్య కారణము తాలూకు సంగతుల టూకీవివరములున్ను అది యెప్పుడు కలిగినదిన్ని.

[c] కోరే పరిహారమున్ను దావాయొక్క మొత్తములేక విలువ.

[ఖుద్దునగాని ఏజెంటుమూలముగాగాని హాజరుకావడము.]—

24. [a] ఆస్తితకలవాడైనను లేనివాడైనను న్యాయవాది వృత్తిదారు డెవ్వడుగాని ఒక వ్యాజ్యము లేదా చర్య తాలూకు ఏకక్షిదారుని తరఫుననైనను ఒక గ్రామకోర్టు నెదుట హాజరగుటకు అనుమతింపబడగూడదు. కాని యే కక్షిదారుడైనను తనకు బదులు హాజరయి వాదించుటకు ఒక నౌకరుకు, గుమాస్తాకు, భాగస్వామికి, బం

ధువుకు లేదా స్నేహితునికి అధికారమియ్యవచ్చును: కాని, [a] న్యాయముకలగగలందులకై కక్షిదారుడు స్వయముగా హాజరుకావడము ఆవశ్యకమని గ్రామమునసబుకు తోచేటప్పుడెల్లా, ఆ వ్యాజ్యకక్షిదార్లలో యెవరయినా స్వయముగా హాజరుకావలసినదని వుత్తరువుచేయుటకు అతనికి అధికారము కద్దు; అట్లా వుత్తరువు చెయ్యబడ్డ కక్షిదారుడు స్వయముగా హాజరుకాని యెడల, స్వయముగా తానయినను సరే తనకుగాను ఏజంటైనను సరే హాజరుకానిపక్షమ్లో అతనికి యేమి ఫలితముకలుగునో అదే ఫలితమునకు అతను లోబడవలసినది.

[ప్రతివాదికి సమ్మను యేప్రకారము అందచేయబడవలసినది.]— 25. ప్లెయింటు క్రమప్రకారము దాఖలు చెయ్యబడ్డమీదట గ్రామమునసబు దాన్ని రిజస్టరుచేయించి నిర్దేశించిన వొకరోజున హాజరయి దావాకు జవాబు చెప్పవలసినదని లిఖితమూలమైన సమ్మను ద్వారా ప్రతివాదికి వుత్తరువు చెయ్యవలసినది, ఆ సమ్మను అయినది [b] ప్రతివాదికి ఖుద్దున అందచేయబడవలెను దానిమీద అతని సంతకము తీసికొనబడవలెను [b] మరిన్ని అందుల నకలును, సమాచారము తీసుకొనిపొయ్యేపని మామూలుగా యెవరిదో ఆ గ్రామ నవుకరు గాని 12 వ సెక్షను ప్రకారము కలెక్టరువల్ల నియమించబడ్డ యే యితర మనిషిగాని అతనికి యిప్పించవలసినది.

[ప్రతివాది సమ్మను అందించుకోకుండా తప్పించుకొనేయెడల అది అందించేవిధము.]— 26. ప్రతివాది సమ్మను అందించుకోకుండా తప్పించుకొంటున్నాడని [c] లేదా సమ్మనులో తన సంతకము చేయనని నిరాకరించినాడని [c] గ్రామమునసబుకు తృప్తిగా తెలిసిన పక్షమునకు, ప్రతివాదితోకూడా వాసముచేస్తూవుండే అతని కుటుంబములో చేరిన వయస్సువచ్చిన యేమగవానివద్దనయినా అది అందచేసి అందుల నకలు అతనికి యిప్పించవలసినదనిగాని ప్రతివాది సాధారణముగా వాసముచేసేయింట్లో యేదో వొక వెల్లడి అయిన భాగమందు అందుల నకలు అంటించవలసినదనిగాని గ్రామమునసబు వుత్తరువు చేయవచ్చును.

[ప్రతివాది కోర్టుయొక్క ప్రదేశాధికార హద్దుకు వెలుపల

వున్నయెడల సమ్మను అంద చేసేవిధము.]— గ్రామకోర్టు యొక్క ప్రదేశాధికార హద్దుకు వెలపల ప్రతివాదికి సమ్మను అందచెయ్యడము అవశ్యకముగా వుండేటప్పుడెల్లా, అది డిస్ట్రిక్టు మునసబు వద్దకి పంపించబడవలసినది, ఆపున, అది తనవల్ల సాదరుచెయ్యబడ్డ సమ్మనుగావుంటే యెట్లాగో అట్లాగే అందచేసేలాగున చేసిన తర్వాత దాన్ని అట్లా అందచేసిన రిపోర్టు సహితము దాన్ని గ్రామకోర్టుకు రిటర్ను చెయ్యవలసినది. అట్టి రిపోర్టు అయినది అందులో చెప్పివున్న సంగతులకు ప్రత్యక్షనిదర్శనముగా వుండవలసినది.

[ప్రతివాది హాజరుకాని పక్షమునకు చర్య.]— 28. ప్రతివాది నిర్ణయించి వున్నరోజున ఖుద్దునగాని ఏజంటుమూలముగాగాని హాజరుకాకుండావుండి సమ్మను క్రమప్రకారము అంద చెయ్యబడ్డదని ఋజువు అయినయెడల గ్రామ కోర్టువారు ఎక్సపార్టీ (ఏకపక్షము) గా విచారణచెయ్య నారంభించవచ్చును.

సమ్మను క్రమప్రకారము అందచెయ్యబడ్డదని ఋజువుకాని యెడల గ్రామమునసబు కొత్తగా సమ్మను జారీచెయ్యవలసినది.

[ప్రతివాది వ్యాజ్యమునుగురించి రెండుదినముల నోటీసు యివ్వవలసినదని అడుక్కోవచ్చును.]— ఒక్కొక ప్రతివాది వ్యాజ్యమును గుర్చించి పరిష్కారముగా రెండుదినముల నోటీసు యివ్వవలసినదని అడగవచ్చును, నిర్ణయించిన రోజున జవాబు చెప్పుటకు ప్రతివాది సాధ్యమయ్యేలాగు తగిన కాలముందు సమ్మను అందచెయ్యబడనియెడల విచారణను మరియొకరోజువరకు నిలిపిపెట్టి అందునగురించి ప్రతివాదికి లిఖితమూలముగా నోటీసుకు యివ్వవలసినది.

[సమ్మను జారీచేసే కక్షిదారుని ఖర్చున అందచెయ్యబడవలసినది.]— 29. గ్రామ నవుకరువల్ల కాకుండా మరియొకవిధమున యీ ఆక్టు ప్రకారము అందచెయ్యబడు ప్రతిసమ్మను యెవరితరఫున జారీచెయ్యబడుతున్నదో ఆ కక్షిదారుని ఖర్చున అది అందచెయ్యబడవలసినది. [a]

[వాది హాజరుకాకుండానున్ను ప్రతివాది దావా వొప్పుకోకుండానున్ను వున్నయెడల, లేక వాదితప్పి పోవడమువల్ల సమ్మను అందచే

యబడనియెడల చర్య.]— 30. ప్రతివాది హాజరవుటకు నిర్ణయించినరోజున—

(1) ఉభయకక్షిదార్లున్ను హాజరుకానియెడల, లేక

(2) వాది హాజరుకాకుండా ప్రతివాదిమాత్రము హాజరయి దావావొప్పుకోనియెడల, లేక

(3) వాది తప్పిపోవడమువల్ల ప్రతివాదికి సమ్మను అందచేయబడకపోయివుండి ఆ ప్రతివాది హాజరు కానియెడల,

గ్రామ కోర్టువారు మరియొకవిధమున వుత్తరువుచెయ్యనిపక్షమందు ఆ వ్యాజ్యమును తోసివేయవలసినది.

[వాది హాజరుకాకుండావుండి ప్రతివాది దావా వొప్పుకొనేయెడల చర్య.]— 31. వాది హాజరుకాకుండా ప్రతివాదిమాత్రము హాజరయి దావా మొత్తము యావత్తుగాని కొంతమట్టుకు గాని వొప్పుకొనేపక్షమందు అట్లా వొప్పుకోవడమునకు అనుగుణముగా గ్రామకోర్టువారు ప్రతివాదిమీద తీర్పుచెప్పవలసినది, అయితే దావా మొత్తములో కొంతభాగము మాత్రము వొప్పుకోబడ్డయెడల కోర్టువారు విచారణను మరియొకదినమువరకు నిలిపిపెట్టవచ్చును.

[కారణము చూపినమీదట 30 వ సెక్షను, లేక 31 వ సెక్షనునుపట్టి చెయ్యబడ్డ వుత్తరువును రద్దుచెయ్యడము.]— 32. 30 వ సెక్షను తాలూకు 1 వ క్లాజు, లేక 3 వ క్లాజునుబట్టి వొక వ్యాజ్యము తోసివేయబడేటప్పుడెల్లా, వాది [b] కాలనిర్ణయపు చట్టమునకు లోబడి [b] కొత్తగా వ్యాజ్యము తేవచ్చును; వ్యాజ్యము తోసివేసేలాగు 30 వ సెక్షను తాలూకు 2 వ క్లాజు ప్రకారము చెయ్యబడ్డ వుత్తరువు తేది మొదలుకొని, లేక 31 వ సెక్షను ప్రకారము దావాలోకొంత భాగమునకు మాత్రము చేయబడ్డ డిక్రీ తేది మొదలుకొని ముప్పయిదినములలోగా వాది తాను హాజరవుటకు ఆటంకమైనదని తగిన కారణమువల్ల గ్రామ కోర్టువారికి తృప్తికరముగా తెలియచేసినయెడల ఆ కోర్టువారు వ్యాజ్యము తోసివేయడమునుగాని డిక్రీగాని రద్దుపర్చి వ్యాజ్యమును జరిగించుటకుగాను వొకదినము నిర్ణయించవలసినది.

[ప్రతివాదిమీాదచేసిన ఎక్సుపార్టి డిక్రీని రద్దుచెయ్యడము.]—
33, ఎవరిమీాద ఎక్సుపార్టిగా డిక్రీచెయ్యబడ్డదో అట్టి యే ప్రతి వాది అయినను దాన్ని జారీలోకి తెచ్చుటకుగాను. యేదయినా ఆజ్ఞా పత్రిక నెరవేర్చే తేదిమొదలు ముప్పయి రోజులలోగా దాన్నిరద్దుపర చవలసినదని గ్రామకోర్టుకు దరఖాస్తు చేసుకోవచ్చును; సమ్మనుగాని నోటీసుగాని క్రమప్రకారము అందచేయబడలేదని అయినా, ప్రతివాది హాజరవుటకు తగినకారణమువల్ల తనకు ఆటంకమైనదని అయినా కోర్టు వారికి తృప్తిగా తెలిసినయెడల వారు డిక్రీని రద్దుపరచి వ్యాజ్యము జరి గించుటకుగాను వొకదినము నిర్ణయించవలసినది.

[ఎదటి కక్షిదారునికి నోటీసు యివ్వకుండా డిక్రీ రద్దుచెయ్యాబ డకూడదు.]— 34. 32 వ సెక్షనునుపట్టిగాని 33 వ సెక్షనును పట్టిగాని యేదైనా దరఖాస్తుచేసుకొన్నమీాదట దాన్నిగురించి యెదటి కక్షిదారునికి నోటీసుయివ్వకుండా డిక్రీ రద్దుచెయ్యబడకూడదు.

## 5 వ అధ్యాయము.

### వ్యాజ్యములను విచారణచేయడము, తీసివేసుకోవడము, లేక రాజిగాపోవడము, సాక్షులను సమ్మను చేయడము, వారిని పరిశీలించడము, వీటిని గురించి.

[ఉభయ కక్షిదార్లు హాజరయినమీాదట చర్య].— 35. ప్రతివాది హాజరయినయెడల ప్లెయింటులోచేసివున్న దావా అతడు వొప్పుకొంటాడా లేదా అని కోర్టువారు అతన్ని అడిగి తెలుసుకోవల సినది. అతడు దావా వొప్పుకొనేపక్షమునకు, లేక ఆ వ్యాజ్యము రాజీ చేయబడ్డ పక్షమునకు అట్లా వొప్పుకోవడముగాని రాజీగాని లిఖితము చేసి అందులో కక్షిదార్లు సంతకము చేయవలసినది, అందుమీాదట కోర్టువారు అందుకు అనుగుణముగా డిక్రీచేయవలసినది. అతడు దావా వొప్పుకోనిపక్షమందు అతనికిగల ఆక్షేపణలను వాఙ్మూలముగాగాని లిఖితమూలముగా గాని తెలియచేయుమని అతన్ని అడుగవలసినది, వీరిన్ని కోర్టువారికి యుక్తమనితోచేపట్ల లిఖితరూపమయిన స్టేటు మెంటు దాఖలు చేసుకొనేటట్టు అతనికి అవకాశము కలగగలందులకై

వారు ఆ కేసు నిలిపిపెట్టవచ్చును.

[వ్యాజ్యము తీసివేసుకోవడము.]— 36. వాది వ్యాజ్యము తీసివేసుకోవలెనని కోరేపక్షమునకు అతడు ఆ సంగతిని లిఖిత మూలముగా కోర్టువారికి తెలియచేయవలసినది, వారు ఆ వ్యాజ్యము ఫైలులోనుండి తీసివేయవలసినది, మరిన్ని అదే వ్యాజ్యకారణమునుపట్టి కొత్తగా వ్యాజ్యము తేబడకూడదు.

[ప్రమాణముమీద వ్యాజ్యము యెప్పుడు ఫైసల్ చెయ్యబడవచ్చును.]— 37. ఉభయ కక్షిదార్లలో యెవరయినను యితర కక్షిదారుడు ప్రమాణముచేసినమీదట వ్యాజ్యము ఫైసలు చేసుకోవడమునకు యిష్టపడివుండి అట్టి యితర కక్షిదారుడు ప్రమాణముచేయుటకు సమ్మతించి చేసినయెడల కోర్టువారు అట్టి ప్రమాణప్రకారము తీర్పుచెప్పవలసినది.

[ఎదురుదావా.]— 38. వాది ప్రతివాదికి న్యాయశాస్త్రసమ్మతముగా బాకీవుండి ఆ ప్రతివాది గ్రామకోర్టులో వ్యాజ్యము తేకూడనదిగావున్న యేదయినా మొత్తమును ఎదురుదావాగా ప్రతివాది తెలియచేయవచ్చును, అట్టి యెదురుదావా స్థాపించబడ్డయెడల వుభయకక్షిదార్లలో యెవనికయినను బాకీవున్నట్టు కడపట అగుపడేయే మొత్తమునకయినను డిక్రీచేయబడవలసినది.

[హాజరులేని సాక్షులను సమ్మనుచేసి పిలిపించవలసినది.]—

39. ప్రతివాదియొక్క వివరపత్రిక దాఖలైనమీదట కోర్టువారు, ఆ దావాయొక్క వాస్తవమునుగురించి పరిశీలనచేయ నారంభించవలసినదేగాక వుభయకక్షిదార్లలో యెవరివల్లనయినను వుదహరించబడి హాజరులేకుండావున్న సాక్షులను సమ్మనుచేసి పిలిపించవలసినది.

[సాక్షులకు సమ్మన్లు యెట్లా అందచెయ్యబడవలసినది.]—

40. గ్రామకోర్టుయొక్క అధికారహద్దులకులోపుగా వాసముచేసే యే సాక్షి అయినను వాగ్రూపముగానయినా లిఖితమూలముగానయినా సమ్మనుచేయబడవచ్చును. కోర్టుయొక్క అధికారహద్దుకు వెలపల అందుమయిళ్ళకులోపుగా వాసముచేసే యే సాక్షి అయినను లిఖితమూలముగా సమ్మనుచేయబడవచ్చును, అట్టి సమ్మను యెవరిఅధికారహద్దు

లోపుగా అతను వాసము చేస్తున్నాడో ఆ గ్రామమునసబుమూల ముగా అందచేయబడవలసినది.

[సవాళ్ళు యెప్పుడు పంపవలసినది.]— ఏసాక్షిఅయి నను అధికార హద్దుకువెలపల అయిదుమైళ్ళకు జాస్తిదూరములోవా సముచేసేయెడల, లిఖితమూలమయిన సవాళ్ళు తయారుచేసే లాగు కోర్టువారు కక్షిదార్లకు వుత్తరువుచేసి, యెవరిఅధికార హద్దులోగా ఆ సాక్షి వాసముచేస్తున్నాడో ఆ గ్రామమునసబువద్దికి అట్టి సవా ళ్ళను వొక వుత్తరముతో కూడా పంపవలసినది, ఆ మునసబు—సదరు సాక్షిని తక్షణము సమ్మనుచేసి పిలిపించి సవాళ్లనుకొని అతనిని పరిశీ లనచేసి అతడుచెప్పే జవాబులను హ్యాజ్యము యెక్కడజరుగుతున్నదో ఆకోర్టుకు వాపసుచెయ్యవలసినది.

[హాజరయి సాక్ష్యముచెప్పేలాగు, లేక దస్తావేజు హాజరుపర చేలాగు సమ్మను.]— 41. సమ్మనుఅయినది, హాజరై సాక్ష్యము చెప్పేలాగునగాని దస్తావేజు హాజరుపరచేలాగున, లేక హాజరుపరచే టట్టు చేసే లాగునగాని సమ్మను చేయబడ్డమనిషికి వుత్తరువు చెయ్యా వచ్చును.

[ఖుద్దున హాజరుకాకుండా కొందరు స్త్రీలున్ను యితర మను ష్యులనున్ను మినహాయించడము.]— 42. దేశాచారములను పట్టిన్ని దేశమర్యాదలనుపట్టిన్ని బహిరంగముగా అగుపడేటట్టు బలవం తపరచబడకూడని స్త్రీలున్ను, కోర్టులో ఖుద్దున హాజరు కాకుండా మినహాయించబడ్డ మనుష్యులున్ను, వ్యాధివల్లగాని దేహ దౌర్బల్యము వల్లగాని బలమయిన అసందర్భము లేకుండా హాజరుకాకూడని యేమని షిన్ని సమ్మను చేయబడకూడదు; అయితె అట్టి యే మనిషియొక్క అయినా సాక్ష్యము అవశ్యకముగా వున్నయెడల గ్రామకోర్టువారు అట్టి వారిని వారి వాసస్థలమందు పరిశీలనచేయవలసినది.

[సాక్షులను పరిశీలించడము.]— 43. సాక్షులను ప్రమా ణముమీదగాని ప్రమాణపూర్వకమయిన రూఢివ్యాకముమీదగాని పరిశీలించవలసినది, అయితే గ్రామకోర్టువారు సాక్షులయొక్క వాఙ్మూ లము వ్రాతమూలముగా పుచ్చుకోవలసిన అవశ్యకము లేదు.

[రాజీగాపోవుటకుగాని యితర కారణమునుపట్టిగాని వ్యాజ్యము నిలిపిపెట్టడము.]— 44. కక్షిదార్లు రాజీగా, లేక యేదయినా చాలినంత యితరకారణమునకు గాను ఆసంగతిని పరిష్కరించేటట్టు వున్నదని అగుపడేయెడల గ్రామకోర్టువారు, వ్యాజ్యవిచారణను మరి యొక దినమువరకు నిలిపివుంచవచ్చును, అట్లా విచారణకుగాను యేర్ప రచిన దినమును కక్షిదార్ల సమక్షమందుగాని ప్రతివాది హాజరుకాని సంగతులలో వాదియొక్క సమక్షమందుగాని నిర్ణయించవలసినది, అట్టి రోజున కక్షిదార్లుగాని వారిలో యెవరయినాగాని హాజరుకా కుండా తప్పిపోయిన పక్షమందు గ్రామకోర్టువారు-30-31 సెక్షనులో ఆ విషయమై నిర్ణయించివున్నవిధములలో వొకవిధమున వ్యాజ్యమును పరిష్కరించ నారభించవచ్చును, లేక తమకు యుక్తమనితోచే యితర వుత్తరువు చెయ్యవచ్చును.

## 6 వ అధ్యాయము.

### డిక్రీనిగురించిన్ని అందుల అమలు నెరవేర్చడమునుగురించిన్ని.

[విచారణ ముగిసినమీదట కోర్టువారు డిక్రీచేయవలసినది.]— 45. కక్షిదార్లనుగాని వారి ఏజెంట్లనుగాని విచారణచేసి వుభయపక్షపు సాక్ష్యము యోచించినందుమీదట, గ్రామకోర్టువారు న్యాయముగానున్న నిష్పక్షపాతముగానున్న మనస్సాక్షికి అనుగుణముగా అగుపడేవిధముననున్ను డిక్రి చేయవలసినది.

[డిక్రీలో వుండవలసిన సంగతులు.]— 46. డిక్రీలో, వ్యాజ్యనెంబరు—కక్షిదార్ల పేళ్ళు—దావావివరములు — విమర్శించబడిన సాక్షులపేళ్లు — చూడబడ్డ దస్తావేజులు ఫలానివి అనేదిన్ని — అందుపైన చేసినతీర్పు — అట్టితీర్పుకు వుండుకొన్న కారణములు యివి వుండవలయును. మరిన్ని తీర్పుచెయ్యబడిన పైకపు మొత్తము, అప్పగింతచెయ్య బడవలసివున్న చరాస్తి, ఖర్చుల మొత్తము, అప్పగింత చెయ్యనిపక్షమునకు అందుకుబదులు చెల్లించవలసినమొత్తము, యే యే కక్షిదార్లు యెంతెంత అట్టిఖర్చులు చెల్లించవలసినదో ఆ సంగతి, యివి అందులో కనపరచి వ్రాయవలసినది.

**ఏతారీఖున డిక్రిచేయబడుతున్నదో ఆ తారీఖును నమూదుచేసి**

గ్రామమునసబు అందులో సంతకము చేయవలసినది. వ్యాజ్యము [a] పంచాయతీ కోర్టు [a] వల్ల విమర్శించబడే పక్షమునకు డిక్రీ అంగీకరించే అట్టి [a] పంచాయతీ కోర్టు [a] మెంబర్లు అందులో సంతకము చెయ్యవలసినది.

[b] అంతట డిక్రీయొక్క నకలు ప్రతిపార్టీకిని నిర్దేశింపబడిన విధముగా అప్పగింపబడవలెను. [b]

[డిక్రీలో వడ్డీ చెల్లించేటట్టు తీర్మానించవచ్చును, లేక వాయిదాలుగా చెల్లించేటట్టు వుత్తరవు చెయ్యవచ్చును.]— 47. రొక్క పైకమునకు తెచ్చిన వ్యాజ్యములలో గ్రామకోర్టువారు డిక్రీఅయిన మొత్తమునకు వ్యాజ్యము తెచ్చిన తేదిమొదలు పైకము చెల్లించే తేదివరకు సంవత్సరానికి నూటికిపన్నెండుకు మించకుండా వడ్డీవేసేటట్టు డిక్రీ చెయ్యవచ్చును.

రొక్క పైకమును చెల్లించేటట్టు గ్రామకోర్టువారు డిక్రీచేసేపక్షమందు, పయినచెప్పినవంతున వడ్డీతోటిగాని వడ్డీలేకుండాగాని వాయిదాలుగా చెల్లించవలసినదని వారు వుత్తరువు చెయ్యవచ్చును.

[ఏవరివల్ల డిక్రీ అమలు నెరవేర్చబడవచ్చునో ఆ కోర్టువారు.]—

48. డిక్రీచేసిన గ్రామ కోర్టువారుగాని అమలు నెరవేర్చడమునకుగాను అది యెవరివద్దికి పంపబడుతున్నదో ఆ గ్రామ కోర్టువారుగాని డిస్ట్రిక్టు మునసబుగాని యిందులో యీ దిగువచెప్పేవున్న నిబంధనలను అనుసరించి ఆ డిక్రీని అమలు నెరవేర్చవలసినది.

[నిర్దేశించిన చరాస్తికిగానైన డిక్రీయెట్లా అమలు నెరవేర్చబడవలసినది.]— 49. నిర్దేశించబడ్డ యేదైనా చరాస్తికిగాను డిక్రీ చెయ్యబడ్డపక్షమందు, అట్టి చరాస్తిని జప్తుచేసి దాన్ని డిక్రీపొందినవానికి అప్పగింత చెయ్యడమువల్ల అది అమలు చలాయించబడవచ్చును, ఆ ఆస్తి జప్తుచెయ్యడమునకు సాధ్యపడనిపట్ల అందుకు ప్రత్యామ్నాయము అని డిక్రీచెయ్యబడ్డ పయికపు మొత్తమును చెల్లించేటట్టు నిర్బంధించడమువల్ల డిక్రీ అమలు చలాయించబడవలసినది.

[డిక్రీనిపట్టి పైకము చెల్లించుగాని యితర పరిష్కారముగాని మునసబు యెదుట చెయ్యబడవలసినది, లేక రికార్డుచేయబడవలసినది.]—

50. గ్రామకోర్టువారివల్ల చెయ్యబడ్డ డిక్రీనిపట్టి చెల్లించబడతగ్గ యావత్తుపైకము ఆ డిక్రీ అమలు నెరవేర్చడము యెవరిపనిగావున్నదో ఆ గ్రామమునసబుయొక్క సమక్షమందు, డిక్రీపొందినవానివద్దనయినను వ్రాతమూలమున ప్రత్యేకముగా అధికారముకలగచెయ్యబడ్డ అతని ఏజెంటువద్దనయినను చెల్లించబడవలసినది; అయితే డిక్రీపొందినవానికి సమాధానకరమయ్యేలాగు ఆ డిక్రీ మరియొకవిధమున పరిష్కరించబడ్డపక్షముకు అది ఫలానివిధమున పరిష్కరించబడ్డదని లిఖితము చేసి అట్టి గ్రామమునసబుయొక్క సమక్షములో ఆ డిక్రీపొందినవాడు గాని అతని ఏజంటుగాని అందులో సంతకముచేయవలసినది, మరిన్ని ఆ గ్రామమునసబు దాన్ని యధార్థపరచవలసినది.

అట్లాపయికము చెల్లించబడ్డదని, లేక పరిష్కరించబడ్డదని గ్రామమునసబు డిక్రీలో ఇఖ్దార్సుచేసి 10 వ సెక్షనులో చెప్పివున్న వ్యాజ్యముల రిజస్టరుయందు రికార్డుచేయవలసినది.

డిక్రీప్రకారము పైకము చెల్లించడముగాని డిక్రీని బొత్తిగానైనా కొంతమట్టుకైనా పరిష్కరించడముగాని, యీ సెక్షనులో నిర్ణయించివున్న విధముననయినా డిస్ట్రిక్టు మునసబుకోర్టులో నయినా పయికము చెల్లించబడి, లేక రికార్డుచేయబడివుంటేనేతప్ప, లేనియెడల ఒప్పుకోబడకూడదు.

[తీర్పుఋణస్థుడు పట్టుకోబడనూ కూడదు. స్థిరాస్తి జప్తుచెయ్యబడనూకూడదు.]— 51. 66_67 వ సెక్షన్ల నిబంధనలకు లోబడి, గ్రామకోర్టువారివల్ల చెయ్యబడ్డ డిక్రీని అమలు నెరవేర్చడము కొరకు తీర్పు ఋణస్థుడు పట్టుకోబడనూకూడదు, ఏ స్థిరాస్తిన్ని జప్తు చెయ్యబడనూకూడదు.

[చరాస్తిని జప్తుచెయ్యడము.]— 52. డిక్రీపొందినమనిషి దరఖాస్తు చేసుకొన్నమీదట, గ్రామకోర్టువారు — తమ అధికారహద్దుకులోపుగా డిక్రీపొందినమనిషి చూపునట్టి తీర్పు ఋణస్థునియొక్క యేదయినా చరాస్తిని డిక్రీప్రకారము చెల్లించబడవలసిన మొత్తముయొక్క కిమ్మతువరకు జప్తుచెయ్యవలసినది. [a]కాని, 1908 వ సంవత్సరపు సివిలు ప్రొసీజరు కోడు తాలూకు 60 వ సెక్షను ననుసరించి

జప్తుచేయబడకుండ మినహాయింపబడియుండు ఆస్తి యేదిగాని అట్లు జప్తుచేయబడదగియుండగూడదు. [a]

[తీర్పు రుణస్థుని స్వాధీనమందు వున్నపట్ల యెట్లా జప్తు చెయ్య వలసినది.]— 53. సొత్తు తీర్పుఋణస్థుని స్వాధీనములో వున్న యెడల దాన్ని నిశ్చయముగా పట్టుకొని జప్తుచేయవలసినది, గ్రామము నసబు దాన్ని బందోబస్తుగా వుంచడమునకు యేర్పాటు చెయ్యవలసి నది. కావలసినప్పుడు దాన్ని తెచ్చి హాజరు పరచగలందులకుగాను లిఖితమూలముగా చాలినంత జామీను యిచ్చిన మీదట తీర్పుఋణ స్థునివశమందు అదివుంచబడవచ్చును. అట్లా చెయ్యనియెడల హాజరు చెయ్యబడని సొత్తుయొక్క కిమ్మతువరకు జామీనుదారునిమీద డిక్రీ అమలు నెరవేర్చబడవచ్చును.

[తీర్పు రుణఋణస్తునివశమందు లేనియెడల యెట్లాజప్తుచెయ్య వలసినది.]— 54. సొత్తు తీర్పు ఋణస్థుని స్వాధీనమందు వుండ నిపక్షమునకు, ఆ సొత్తు యెవరిస్వాధీనమందువున్నదో ఆ మనిషి దాన్ని తీర్పు ఋణస్తునిపరము చెయ్యకూడదని లిఖితమూలమైన వుత్తరువు ద్వారా జప్తుచెయ్యవలసినది.

[ఋణములు యెట్లాజప్తు చెయ్యబడవలసినది.]— 55. తీర్పుఋణస్థునికి బాకీవుండే ఋణములున్ను పైకపు మొత్తములున్ను గ్రామకోర్టువారు మరువుత్తరువుచేసేవరకు తీర్పుఋణస్థుడు ఆ ఋణము ను వసూలుచేయకూడదని, లేక పైకపుమొత్తమును పుచ్చుకోకూడ దనిన్ని ఋణస్థుడు, దాన్ని చెల్లించకూడదనిన్ని ఆజ్ఞాపించునట్టి లిఖిత మూలమైన వుత్తరువుచేత జప్తుచెయ్యబడవలసినది. స్థిరాస్తిమీద కలి గివున్న ఋణమును జప్తుచేయుటకుగాని విక్రయించుటకుగాని గ్రామకో ర్టువారికి యీ సెక్షనులో వుండేదియేదిన్ని అధికారము కలుగజేసినట్లు యెంచబడకూడదు.

[జప్తుచేసినతర్వాత సొత్తును లోలోగాపరాధీనము చెయ్యడము రద్దుకావలసినది.]— 56. వాస్తవముగా పట్టుకొనగాని లిఖిత మూలమైన వుత్తరువుద్వారాగాని జప్తు చెయ్యబడ్డతర్వాత, జప్తులో వుండేవరకు. ఆ జప్తు సొత్తు విక్రయము—దానము—తాకట్టు, లేక ఋ

యేవిధముగా నయినా లోలోగా పరాధీనము చెయ్యడమున్ను తీర్పు ఋణస్థునికి ఆ ఋణము చెల్లించడమున్ను—జప్తును అనుసరించి అమలు చలాయించబడతగ్గ అన్ని దావాలకు విరోధముగా రద్దుకావలసినది.

[జప్తుచెయ్యబడ్డ సొత్తునుగల దావాలను విచారించడము.]—

57. ఒక డిక్రీని అమలు నెరవేర్చడముకొరకు జప్తుచెయ్యబడ్డ సొత్తుకు యేదయినా దావాచెయ్యబడ్డయెడల గ్రామకోర్టువారు ఆదావాగురించి విచారణచేయవలసినది, తీర్పుఋణస్థునికి అందులో విక్రయించే బాధ్యత లేదని కనుపడ్డయెడల ఆ సొత్తును జప్తులోనుండి విడదలచేయవలసినది.

[జప్తుకు తర్వాత పదిహేను దినములకు తక్కువకాకుండా సొత్తు విక్రయించి విక్రయమును ప్రకటించవలసినది.]— 58. జప్తుచేసిన తర్వాత సాధ్యమయినంతత్వరలో, గ్రామకోర్టువారు జప్తుచెయ్యబడ్డ సొత్తును విక్రయించుటకుగాను జప్తుచేసిన తేదిమొదలు పదిహేను రోజులకు తక్కువకాకుండా వొకరోజు నిర్ణయించి వుద్దేశించిన విక్రయమును గురించి తన కోర్టుకు వెలపల వ్రాతమూలమైన ప్రకటనను అంటించేటట్టు చెయ్యవలసినది, మరిన్ని అట్టి విక్రయమునకు ముందు దాన్ని గురించి దండోరావేసి యింకా ప్రకటించవలసినది.

[నిబంధన.]— అయితే (1) తీర్పు ఋణస్థునియొక్క లిఖితమూలమయిన సమ్మతిమీద, లేక (2) పట్టుకోబడ్డ సొత్తు తనంతట శీఘ్రముగా చెడిపోతగ్గదిగా ఉండేయెడల, లేక (3) దాన్ని కాపుదలలో వుంచుటకుపట్టునట్టి ఖర్చు దానివెలకు మించేయెడల, కోర్టువారు తండోరావేసి క్రమమయిన నోటీసు యిచ్చినతర్వాత జప్తుచెయ్యబడ్డ తేదిమొదలు పదిహేను రోజులలోగా యేకాలమందైనా. జప్తుసొత్తును విక్రయించవచ్చును. అట్టిసంగతిలో విక్రయపైకమును, డిక్రీలు అమలు నెరవేర్చడమందు జప్తుచెయ్యబడ్డ మొత్తములను చెల్లించేనిమిత్తము యిందులో యీ దిగువ చెప్పివున్న నిబంధనలకు లోబడ కోర్టువారు వుంచుకోవలసినది.

[విక్రయములో చర్య.]— 59. విక్రయించుటకుగాను నిర్ణయించిన రోజున గ్రామ మునసబుయొక్క సమక్షమందు ఆ సొత్తు

బహిరంగమైన యేలము వేయబడి యెక్కువ ధర అడిగినమనిషికి విక్ర యించబడవలసినది. ఆధర అడ్డులేకుండా చెల్లించవలసినది, అట్లాచెల్లించక తప్పిపొయ్యే పక్షమునకు ఆ సొత్తును మళ్ళీ యేలముద్వారా విక్రయించవలసినది.

ఖరీదుపైకము చెల్లించిన మీాదట, కోర్టువారు అందుకుగాను రశీదుయివ్వవలసినది, అప్పట్లో ఆవిక్రయము పూర్తికావలసినది.

మళ్ళీ యేలము వేసేటప్పుడు యేదయినా నష్టము సంభవించిన యెడల అది, ఋణమునకు తీర్పుపొందినవాడుగాని తీర్పు ఋణస్థుడుగాని అడుగుకొన్న మీాదట, పైకము కట్టుటకు తప్పిపోయిన మనిషి మీాద అందుకుగాను డిక్రిచేసివుంటే యెట్లాగో అట్లాగే అతనివద్దనుండి వసూలు చెయ్యబడ తగివుండవలసినది.

[విక్రయమును నిలిపిపెట్టుటకు అధికారము.]— 60. ఈ ఆక్టుప్రకారము ప్రకటించబడ్డ యేదయినా విక్రియమును కోర్టువారి యిష్టానుసారము ఫలాని దినమునకు అని నిలిపిపెట్టి దాన్నిగురించి 58 వ సెక్షనులో నిర్ణయించివున్న విధమున జనులకు ప్రకటించవలసినది.

[విక్రియించిన సొత్తును గ్రామమునసబున్ను యితర వుద్యోగస్థులున్ను వెల అడగనూకూడదు, లేక కొనుక్కోనూకూడదు.]—

61. ఈ ఆక్టులోబడ్డ యేదయినా యేల విక్రయసంబంధముగా యే పని అయినను చేయవలసివున్న గ్రామ మునసబుగాని యితర వుద్యోగస్థుడుగాని అట్టి యేలములో విక్రయించబడు యేదయినా సొత్తును ప్రత్యక్షముగా నయినను సరే పరోక్షముగా నయినను సరే వెల అడగనూకూడదు, లేక అందులో బాధ్యతయున్ను పొందనూ కూడదు.

[ఋణమునున్ను ఖర్చులనున్ను యివ్వచూపినమీాదట విక్రయము నిలపడము.]— 62. సొత్తును యేలములో విడుచుటకు ముందు, డిక్రీప్రకారము బాకీగావున్న మొత్తమున్ను విక్రయఖర్చున్ను గ్రామ మునసబువద్ద యివ్వవచ్చేయెడల, యీా ఆక్టుప్రకారము జరిగించే సొత్తుయొక్క ప్రతివిక్రయమున్ను నిలిపి వేయబడవలసినది.

[విక్రియమువల్ల వచ్చిన పైకము పంచిపెట్టడము.]—
63. అమలు నెరవేర్చడములో వసూలు చేయబడ్డ పైకములోనుండి, అమలు నెరవేర్చడమునకు తగిలిన ఖర్చును మొదట చెల్లించవలసినది అటుతర్వాత డిక్రీదారునికి బాకీవున్న మొత్తమును చెల్లించవలసినది, మిగత యేదయినా వున్నయెడల అదితీర్పు ఋణస్థునికి చెల్లించబడవలసినది.

[వాస్తవముగా పట్టుకోబడ్డ సొత్తు ఖరీదుదారునికి అప్పగింత చేయవలసినది.]— 64. విక్రియించబడ్డ సొత్తు వాస్తవముగా పట్టుకోబడ్డ సొత్తుఅయినయెడల ఆసొత్తును ఖరీదుదారునికి అప్పగింత చేయబడవలసినది.

[ఇతర సంగతులలో సొత్తుయేలాగు ఖరీదుదారునికి అప్పగింత చేయబడవలసినది.]— 65. విక్రయించబడ్డ సొత్తు తీర్పు ఋణస్థుడు గాని యెవరయినా యితర మనిషియొక్క స్వాధీనములో వున్న యెడల, లేక యేమనిషిఅయినను తీర్పు ఋణస్థునికి బాకీవుండే ఋణముగా వున్నయెడల, ఖరీదుదారునితప్ప మరి యెవరికిన్ని ఆసొత్తును స్వాధీనపరచకూడదని, లేక ఋణమును చెల్లించకూడదని అట్టి మనిషికి లిఖితమూలముగా నోటీసు యివ్వడమువల్ల ఆసొత్తు ఖరీదుదారునికి అప్పగింత చేయవలసినది, జప్తుచేసేకాలమందు తీర్పు ఋణస్థునికి అట్టి సొత్తులో, లేక ఋణములో యేబాధ్యతవుండినదో ఆబాధ్యత ఖరీదుదారునికి సిద్ధించవలసినది.

[అమలు నెరవేర్చేనిమిత్తము డిక్రీని డిస్ట్రిక్టు మునసబువద్దికి పంపవచ్చును,]— 66. గ్రామకోర్టువారివల్ల చెయ్యబడ్డ యే డిక్రీ అయినను, డిక్రీపొందినమనిషి దరఖాస్తు చేసుకొన్నమీదట అమలు నెరవేర్చె నిమిత్తము డిస్ట్రిక్టుమునసబు వద్దికి పంపబడవచ్చును, ఆయన అదితానుగాచేసిన డిక్రీగావుంటే యెట్లాగో అట్లాగే అన్నిఅమలు నెరవేర్చవచ్చును, లేక యెందులో ప్రతివాదికి చరాస్థివున్నట్టు తెలియ చేయబడివున్నదో అట్టి యేదయినా యితర గ్రామకోర్టుకు అమలు నెరవేర్చేనిమిత్తము దాన్ని పంపవచ్చును. ఆకోర్టువారు తమవల్ల ఆ డిక్రీ చెయ్యబడ్డట్టె చర్య జరిగించవలసినది.

[డిస్ట్రిక్టుమునసబు యేదైనా డిక్రీని అమలు నెరవేర్చడమును తీసి వేసుకోవచ్చును.]— 67. ఏదయినా డిక్రీని అమలు నెరవేర్చే పనిని యేగ్రామ కోర్టులోనుండి అయినా తీసివేసుకొనుటకున్ను అది తానేచేసిన డిక్రీవలె తానుగా దాన్ని అమలు నెరవేర్చుటకున్ను డిస్ట్రిక్టు మునసబుకు అధికారము కద్దు.

## 7 వ అధ్యాయము.

## నానావిధ విషయములు.

[వ్యాజ్యముతో సంబంధించిన కక్షిదారుడు చనిపోయినమీదట దరఖాస్తు చేసుకోబడినయెడల చనిపోయినవానియొక్క న్యాయశాస్త్ర సమ్మతుడైన ప్రతినిధి పేరును రికార్డులో వ్రాసుకోవచ్చును.]—

68. వ్యాజ్యములో డిక్రీచేయబడుటకు ముందు వాదిగాని ప్రతివాదిగాని చనిపోయిన పక్షమందు న్యాయశాస్త్ర సమ్మతుడయిన అతని ప్రతినిధి పేరును యెదటి కక్షిదారుడయినను న్యాయశాస్త్ర సమ్మతుడయిన అట్టి ప్రతినిధి అయినను దరఖాస్తుచేసుకొన్న మీదట చనిపోయినవానికి బదులు రికార్డులో వ్రాసుకోవచ్చును. అయితే చనిపోయిన ప్రతివాది వద్దనుండి పొందబడి క్రమప్రకారము లెక్క చెప్పబడని ఆస్తియొక్క విలువకుమించి ఆ ప్రతివాదియొక్క న్యాయశాస్త్ర సమ్మతుడయిన ప్రతినిధిమీద డిక్రీ చెయ్యబడకూడదు.

[దరఖాస్తు చేసుకోబడనియెడల వ్యాజ్యము తోసివేయబడవలసినది.] 69. వాదిగాని ప్రతివాదిగాని చనిపోయిన తేది మొదలు అరవైరోజులలోగా అట్టి దరఖాస్తు చేసుకోబడని పక్షమునకు, వ్యాజ్యము తోసివేయబడవలసినది. మరిన్ని అదే వ్యాజ్యకారణమునుపట్టి మళ్ళీ వ్యాజ్యము తెచ్చేటట్టు శలవు యివ్వబడకూడదు.

[ఒకవాది, లేక ప్రతివాదికంటే యెక్కువమంది వున్నయెడల శేషించినవాడు అడుక్కొన్నమీదట, లేదా అతనిమీద వ్యాజ్యము జరగవలసినది.]— 70. ఒకనికంటే యెక్కువమంది వాదులుగాని ప్రతివాదులుగాని వుండి, వారిలో యెవడయినను చనిపోయి అతని ప్రతినిధి పైనచెప్పబడ్డ ప్రకారము చేర్చబడని పక్షమందు, శేషించిన వాది, లేక వాదులు కోరుకొన్నమీదటగాని శేషించిన ప్రతి

వాది, లేదా ప్రతివాదుల మీదగాని వ్యాజ్యము జరగవలసినది.

[డిక్రీదారుడు చనిపోయిన పక్షమందు న్యాయశాస్త్ర సమ్మతుడయిన అతని ప్రతినిధిని అతనిబదులు వుంచుకోవచ్చును.]—

71. డిక్రీ పూర్తిగా అమలు నెరవేర్చబడుటకు ముందు డిక్రీ పొందినవాడు చనిపోయిన పక్షమునకు న్యాయశాస్త్ర సమ్మతుడైన అతని ప్రతినిధి చనిపోయిన మనిషికి బదులు తన పేరు డిక్రీ పొందినవాడుగా వుంచుమని గ్రామకోర్టువారికి దరఖాస్తు చేసుకోవచ్చును. తీర్పుఋణస్థునికి నోటీసు యిచ్చినతరువాత ఆ దరఖాస్తుదారుడు చనిపోయిన మనిషియొక్క న్యాయశాస్త్ర సమ్మతుడైన ప్రతినిధి అని కోర్టువారికి తృప్తిగా తోచినయెడల, వారు అతని పేరును రికార్డులో డిక్రీ పొందినవాణ్నిగా వ్రాసుకోవలసినది.

[తీర్పు ఋణస్థుడు చనిపోయినపక్షమునకు న్యాయశాస్త్రసమ్మతుడయిన అతని ప్రతినిధిమీద డిక్రీ అమలు నెరవేర్చబడవచ్చును.]—

72. డిక్రీ పూర్తిగా అమలు నెరవేర్చబడుటకు ముందు తీర్పు ఋణస్థుడు చనిపోయినపక్షమునకు, డిక్రీ పొందినవాడు దరఖాస్తు చేసుకొన్నమీదట, తీర్పుఋణస్థునివద్ద పొందబడి క్రమప్రకారము లెక్క చెప్పబడని ఆస్తి యెంతో అంత న్యాయశాస్త్ర సమ్మతుడయిన అతని ప్రతినిధిమీద అది అమలు నెరవేర్చబడవచ్చును.

[గ్రామకోర్టువారి చర్యలను డిస్ట్రిక్టు మునసబు పునర్విమర్శ చెయ్యడము.]— 73. గ్రామకోర్టువారు చేసిన యేదయినా డిక్రీ వల్లగాని వుత్తరువువల్లగాని అన్యాయముపొందినట్టు యెంచే యే కక్షిదారుడైనను అట్టి డిక్రీ లేక వుత్తరువుచేసిన తారీఖు మొదలుకొని అరవై రోజులలోగా అర్జి యిచ్చుకొన్నమీదట, డిస్ట్రిక్టు మునసబు—

గ్రామకోర్టువారు లంచము పుచ్చుకొన్నారనే, విశేషముగా పక్షపాతము జరిగించినారనే, లేక దుర్నడతగా ప్రవర్తించినారనే కారణముమీద; లేక

చట్టప్రకారము తమకు యేర్పడివుండని, అధికారము తాము చలాయించినారనే, లేక మరియొకవిధమునకు చట్టమునకు విరుద్ధముగాగాని బహు అక్రమముగాగాని ప్రవర్తించినారనే కారణముమీద; లేక

ఆ డిక్రీ అయినను వుత్తరువు అయినను పరిష్కారముగా అన్యాయముగా [a] వున్నదనే కారణముమీద

సదరు డిక్రీనిగాని వుత్తరువునుగాని రద్దుచేయవచ్చును;

మరిన్ని ఆయనకు యుక్తమనితోచే యితర డిక్రీగాని వుత్తరువుగాని చెయ్యవచ్చును; అయితే యెదటి కక్షిదారునికి నోటీసు యివ్వకుండా సదరు డిక్రీని వుత్తరువుగాని రద్దు చెయ్యబడకూడదు. ఏదైనా అట్టి అర్జీలు పైసలు చేసేవరకు డిస్ట్రిక్టు మునసబు ఆ డిక్రీనిగాని వుత్తరువునుగాని అమలు చలాయించకుండా నిలపవచ్చును.

అరవై దినములకు తర్వాత ఈ సెక్షను ప్రకారము అర్జీ యిచ్చుకోబడ్డయెడల ఆలస్యమైనందుకు తెలియచేసిన కారణము విని డిస్ట్రిక్టు మునసబు తృప్తిచెందిన పక్షమునకు అది ఆయనవల్ల అంగీకరించబడవచ్చును.

ఈ సెక్షనులో నిబంధన కలగచేసివున్నప్రకారము తప్ప, గ్రామ కోర్టువారు జేసే ప్రతి డిక్రీయున్ను వుత్తరువున్ను ఆఖరుదిగా వుండవలసినది.

[డిస్ట్రిక్టు మునసబు డిస్ట్రిక్టు జడ్జికి రిపోర్టు చెయ్యవచ్చును. కొన్ని సంగతులలో డిస్ట్రిక్టు జడ్జికి రిపోర్టు చెయ్యవలసినది.]—

74. 73 వ సెక్షను ప్రకారము డిస్ట్రిక్టు మునసబు డిక్రీగాని వుత్తరువునుగాని రద్దు చేసేటప్పుడెల్లా ఆయన ఆసంగతిని డిస్ట్రిక్టు జడ్జికి రిపోర్టు చెయ్యవచ్చును. మరిన్ని లంచము విశేషపక్షపాతము, లేక దుర్నడత జరిగినదనే హేతువునుబట్టి డిక్రీనిగాని వుత్తరువునుగాని ఆయన రద్దుచేసిన ప్రతిసంగతినిన్ని రిపోర్టు చెయ్యవలసినది.

[నమూనాలు నిర్ణయించుటకు హైకోర్టువారికన్ని రికార్డు పరిశీలించుటకు డిస్ట్రిక్టు జడ్జికిన్ని డిస్ట్రిక్టు మునసబుకున్నూ గల అధికారములు.]— 75. గ్రామకోర్టులో ఉపయోగించడమునకు గాను నమూనాలనున్ను ఆ కోర్టులవారు పంపవలసియున్న లెక్కలున్నూ హైకోర్టువారు అప్పుడప్పుడు నిర్ణయించవచ్చును. డిస్ట్రిక్టు జడ్జిగాని డిస్ట్రిక్టు మునసబుగాని గ్రామకోర్టుల రిజష్టర్లు రికార్డులు, వీటిని ఏ కాలమందైనా తెప్పించి పరిశీలించవచ్చును.

# పంచాయతికోర్టు దావాల మతలబులు.

మహారాజశ్రీ గుంటూారు పంచాయతీకోర్టువారి సముఖమునకు

వాది —రాయసం పిచ్చయ్య.

ప్రతివాది —దొడ్ల వెంకయ్య.

శివిల్ప్రొశీజరు ఇన్స్ట్రక్షను ప్రకారందావా

వాదికులము తండ్రిపేరు జీవనము వయస్సు కాపుర స్తలము.

ప్రతివాది తండ్రిపేరు కులము జీవనము వయస్సుకాపుర స్తలము.

(1) వాదితావున యీప్రతివాది ఖాతాగా చిల్లరవెచ్చము 1922 సం॥ డిశంబరు 18 వ తేదీవరకు వాడుకున్నది రు 25-0-0 లు నె 1 కి 100 కి రు 1-0-0 చొప్పున వడ్డీతో యిచ్చేయేర్పాటు మీాద వాదితావున ప్రతివాది వెచ్చము వాడుకున్నాడు

(2) సదరుపయికమునుగురించి వాదిప్రతివాదిని యెన్నిపర్యాయములు తగాదాపర్చినను చెల్లుయేమి యిచ్చియుండలేదు.

(3) వ్యాజ్యకారణం వాదితావున ప్రతివాది వెచ్చమువాడుకున్నది. 1922 సం॥ 18 డిశంబరు లగాయతు వాడుకున్నాడు. కాబట్టి గుంటూారు గ్రామములో కల్గినది

(4) వాదితావున ప్రతివాదివాడుకున్న అసలు రు 25-0-0 లు 1922 సం॥ ది 18 డిశంబరు లగాయతు 1923 సం॥ ది 18 డిశంబరువరకు నె1కి 100కి 1-0-0 చొప్పున అయినవడ్డీ రు 3-0.0 లు

మొత్తం 28-0-0

లున్ను కోర్టుఖర్చులున్ను యింకా కోర్టువారికి యుక్తమని న్యాయమని తోచేలన్నిపరిహారములతో వాదికి ప్రతివాది యిచ్చురునేలాగున డిక్రీ చేయించగలందులకు ప్రార్థించుచున్నాడు.

దివ్యచిత్తానకు తేవలయును.

వాది సంతకము.

(యదార్థవచనము వ్రాయవలయును)

వాదిసంతకము.

షరా:—యీప్రకారం ప్లయింటులుచేసినతర్వాత ప్రతివాదికిన్ని వాదిసాక్షులకున్ను కోర్టువారు సమచులు చేయించెదరు తర్వాత వాయిదా రోజున విచారణ కాబడును విచారణలో తీసిన ఋజువయిన డిక్రీ యివ్వబడును. లేనియడల దావా కొట్టివెయ్యబడును. ప్రతి దావాకు యీ షరా వర్తించును.

## 1. యింకొక మతలబు

1. వాదితావున ప్రతివాది 1922 సం॥ 2 ఫిబ్రవరి తారీఖున రు 10-0-0 లుచేబదులుగా నె 1కి రు 1కి 0-0-3 చొప్పున వడ్డీ యిచ్చే ఖరారుతో వాదితావున ప్రతివాది బదులు పుచ్చుకున్నాడు.

2. సదరువయికమును గురించి వాది ప్రతివాదిని ఎన్నిపర్యాయములు తగాదాపర్చినను చెల్లుయేమి యిచ్చియుండలేదు.

3. గుంటూరుగ్రామములో వ్యాజ్యకారణం కలిగినది.

4. వాదితావున ప్రతివాది బదులుపుచ్చుకున్నది అసలు రు 10 లు 1922 సం॥ ది 2 ఫిబ్రవరి లగాయతు 1923 సం॥ ది 2 డిశంబరువరకు నెలలు 22 కి నె 1కి రు 1కి 0-0-3 చొ॥ అయ్ను

వడ్డీ రు 3-7-0 లు

మొత్తం 13-7-0

లున్నూ కోర్టుఖర్చులున్నూ యీరోజువరకు దరిమెలా వడ్డీన్ని యింకా కోర్టువారికి న్యాయమని యుక్తమని తోచే అన్నిపరిహారములతో వాదికి ప్రతివాది డిక్రీ యిప్పించ ప్రార్థించుచున్నాడు.

దివ్యచిత్తమునకు తేవలయును.

షరా:- యదార్థవచనము వగయిరాలు మామూలుగా వ్రాయవలెను.

## 2. యింకొక మతలబు

(1) వాదిపేరు ప్రతివాది 1922 సం॥ ది 15 యేప్రియల్ తేదిన యిందుతో దాఖలుచేసిన చేవ్రుత్తరమును వ్రాసియిచ్చి నె 1కి రు 1కి 0-0-3 చొప్పున యిచ్చే ఖరారుతో 15-0-0 లు తీసుకొనివెళ్ళినాడు.

(2) సధరు చేవ్రుత్తరము తాలూకు రు 15-0-0 లలో యెన్ని

పర్యాయములు ప్రతివాదిని వాది తగాదా పరిచినను చెల్లుయిచ్చి యుండలేదు.

(3) వాదికి ప్రతివాది 15-4-22 తేదీన వ్రాసియిచ్చిన చేవ్రుత్తరం గుంటూరు గ్రామములో కలిగినది.

| | |
|---|---|
| (4) చేవ్రుత్తరం తాలూకు అసలు | రు 15-0-0 |
| నెలలు 20 కి నె 1కి రు 1కి 0-0-3 చొ॥ అయ్యినవడ్డీ | 5-0-0 |
| మొత్తం | 20-0-0 |

లున్నూ కోర్టుఖర్చులున్నూ దరిమెలావడ్డీన్నీ వాదికి ప్రతివాది యిచ్చుకున్నేలాగ్నున్నూ యింకా కోర్టువారికి యుక్తమని న్యాయమనితోచే అన్నిపరిహారములతో డిక్రీ యిప్పించవలయునని ప్రార్థిస్తూయున్నాడు.

దివ్యచిత్తానకు తేవలయును.

షరా:— యదార్థవచనము వగైరాలు మామూలుగా వ్రాయవలెను.

# 3. యింకొకమతలబు

1. వాదిపేరటికి ప్రతివాది 1922 సం॥ ది 16 మార్చి తారీఖున్న యిందుతో దాఖలుచేసిన రు 10—0—0 లకు వడ్డీ నె 1 కి 100 కి రు 1—4—0 చొప్పున స్తిరాస్తి అస్వాధీనపు తాకట్టు దస్తావేజును వ్రాయించియిచ్చినాడు

2. సదరు బాకీనిగురించి ప్రతివాదిని వాది యెన్ని పర్యాములు తగాదా పర్చినను అందుక్రిందచెల్లు యేమిరాలేదు.

3. వ్యాజ్యకారణం దావా దస్తావేజు ది 16—3—1922 సం॥ తేదిన గుంటూరు గ్రామములో కలిగినది.

| | |
|---|---|
| 4. దావా అస్వాధీనపు తాకట్టు దస్తావేజు తాలూకు అసలు | 10—0—0 |
| అందునెలలు 21 కి అయ్యినవడ్డీ | 2—12—0 |
| మొత్తం | 12—12—0 |

లున్నూ కోర్టుఖర్చులున్ను నె 1, కి 100 కి రు 1—4—0 లు చొప్పున దరిమెలావడ్డీన్ని తాకట్టు ఆస్తివల్లగాని ప్రతివాదితాలూకుయున్న ఆస్తి వల్లగాని ప్రతివాదివల్ల వాది రాబట్టుకొన్నేలాగునయున్నూ యింకా

కోర్టువారికి యుక్తమని న్యాయమని తోచే అన్ని పరిహారములతో డిక్రీయిప్పించవలయునని ప్రార్థిస్తూయున్నాను.

దివ్యచిత్తానకు తేవలయును.

షరా.— యదార్థవచనము వగైరాలు మామూలుగా వ్రాయవలయును.

## 4. యింకొకమతలబు

1. వాదిపేరటికి ప్రతివాది 1923 సం॥ ఫిబ్రవరు 14 తేదిన రు 40 లకు యిందుతో దాఖలుచేసిన ప్రోనోటును నె 1కి నూటికి రు 1-0-0 చొ॥ వడ్డీతో వ్రాయించియిచ్చినాడు.

2. అందు మింజువలె వాది ప్రతివాదిని ఎన్నిపర్యాయములు తగాదాపర్చినను చెల్లుయేమి యిచ్చియుండలేదు.

3. వ్యాజ్యకార్ణం దావానోటు పుట్టిన ది 14-2-23 తేదీన గుంటూరు గ్రామములో కలిగినది.

4. దావా ప్రోనోటు తాలూకు అసలు రు 40-0-0

అందుకు నెలలు 10 కి నెల 1కి నూటికి రు 1 చొ॥ డిశంబరు 14 తేదీవరకు అయ్యినవడ్డి } 5-0-0

మొత్తం 45-0-0

లున్నూ కోర్టుఖర్చులున్నూ దరిమెలావడ్డిన్నీ యింకా కోర్టువారికి యుక్తమని న్యాయమని తోచే అన్ని పరిహారములతో వాదికి ప్రతివాది యిచ్చుకున్నెలాగున డిక్రీ యిప్పించమని ప్రార్థించుచున్నాను.

దివ్యచిత్తమునకు తేవలయును.

వాదిసంతకముండవలెను.

పైన వుదహరించిన యావత్తు సంగతులు యదార్థమని ప్రమాణముమీద తెలియజేయుచున్నాను.

దివ్యచిత్తమునకు తేవలయును.

వాదిసంతకమువుండవలెను.

# ప్రాంశరినోటు.

ఆన 1920 సం॥ ది 17 అక్టోబరు తేదిన పాతగుంటూరు కాపురస్తుడు ఆళ్ళ వెంకయ్యకు డిటో కాపురస్తుడు బోళ్ళసుబ్బయ్య వ్రాయించియిచ్చిన ప్రాంసరినోటు

(యిందులో తండ్రిపేర్లుమాత్రం వుదహరించబడవచ్చును.)

నాఅక్కరనిమిత్తం (అక్కరలు ఏమియున్నవి వ్రాసుకోవచ్చును) నీతావున అప్పుగాపుచ్చుకొన్న రొఖ్ఖం రు 60_0_0 లు అరవయిరూపాయలు యిందుకువడ్డీ నె 1 కి రు 1 కి 0_0_3 చొప్పున (లేకవారల యిష్టప్రకారం మేర్పరచుకున్నవడ్డీతో) అయ్యే అసలుఫాయిదాలు నీకుగాని నీఉత్తరువుకుగాని అడిగినప్పుడుయివ్వగలవాడను. యిదిసమ్మతిని వ్రాసియిచ్చిన (లేకవ్రాయించియిచ్చిన) ప్రాంశరినోటు.

యిందుకు సాక్షులు

1 రాయిప్రోలు అప్పయ్యవ్రాలు

2 ఘనగం హనుమంతరావువ్రాలు బిళ్ళ

(పైకంతీసుకున్నవారు వ్రాస్తే దస్తూరి స్వహస్తం అని వ్రాయవలెను లేక యితరులు వ్రాస్తే వారలపేరు దస్తూరి ఫలాని వారిది అని వ్రాయవలెను.)

షరా:— యీమనిషి వానిదగ్గరనే తిరిగి ఎప్పుడైన పైకము తీసుకునే యెడల యీనోటు అసలుఫాయిదాలు లెఖ్ఖకట్టి తిరిగి కొంత పైకము ఇచ్చి అప్పుడైన తిరిగి యీవడ్డీగాని లేక అప్పుడువారు ఏర్పరచుకునే వడ్డీగాని వేసుకుని తిరిగి ప్రాంశరినోటు వ్రాయించుకునే వాడికలుకలవు. వారలకు వారలకు కాలావున్నయిల్లు కొంతఅయ్యినతర్వాత యీబాకీలుఅన్ని వడ్డీ అసలుఫాయిదాలు పోగుచేసి తాకట్టు (అస్వాధీనముగాగాని,) స్వాధీనముగాగాని) వ్రాయించుకొనుటకద్దు. (చూడుడుతాకట్టు దస్తావేజుమతలబి)

## బయాన రశీదులు.

ఆన 1922 సం॥ ది 14 అక్టోబరు తారీఖున జొన్నలగడ్డ సుబ్బారాయుడు కుమారుడు రామస్వామిగారికి కాట్రు నాగలింగం వ్రాయించియిచ్చిన రశీదు.

సదరు గ్రామములో నాపూర్వులవల్ల సంపాదించబడి నాస్వాధీనములో వున్న శేరీభూమిని యీరోజున తమకు య 1కి రు 150 లు చొ॥ య 4 లు భూమిని రు 600 లకు విక్రయించి అందుక్రింద యీరోజున బయానక్రింద యిచ్చినవి రు 100 లు గాక శేషించిన 500 లకు విక్రయదస్తావేజు రిజిష్టరు చేయించేకాలమందు రిజిస్ట్రారు వారియెదుట యివ్వవలసినది. యీరోజు లగాయతు నెలరోజులలోగా క్రమమైన దస్తావేజు వ్రాయించుకొని రిజిష్టరు చేయించుకోవలసినది. ఆలాచేయించుకోక వాయిదా వెళ్ళబుచ్చినయెడల యిచ్చిన బయాన వదులుకోవలసినది. నాను స్తిచేత వ్రాయించి యివ్వనియెడల నీకు నష్టముక్రింద రు 500 లు నె 1కి 100 కి రు 2 లు వడ్డీతో యివ్వగలవాడను. యిది నమ్మకమున వ్రాయించియిచ్చిన రశీదు.

యిందుకు సాక్షులు

1. పత్రి నరసింహారావు వ్రాలు.
2. ముద్రబోయిన కోటప్ప నిశాని. సంతకము.

## రశీదు.

ఆన 1921 సం॥ ది 14 ఏప్రియల్ తారీఖు మేడికొండూరు కాపురస్తుడు రావుల అన్నప్పకొడుకు సుబ్బారాయుడుగారికి యిటో గ్రామకాపురస్తుడు పసుపులేటి వీరన్న కొమార్తె అంకమ్మ వ్రాయించి యిచ్చిన రశీదు—

నాతాలూకు శేరిమెరకభూమిని నీకు రు 400-0-0 లకు విక్రయించి యీరోజున బయానక్రింద పుచ్చుకున్నవి రు 50-0-0 లు అక్షరాల యాభైరూపాయలు యిచ్చినావు గనుక ముట్టినది యీరోజులగాయతు నెలరోజులలోగా క్రమమైన క్రయదస్తావేజు వ్రాయించి రిజిష్టరు చేయించి యివ్వగలవాడను ఆలావాయిదానాటికి దస్తావేజు వ్రాయించి

రిజష్టరు చేయించి యివ్వనియెడల సదరు మొత్తమునకు నె 1 కి 100 కి రు 1-0-0 లు చొప్పున వడ్డీతో వస్సుకొని క్రియదస్తావేజు (లో) మొత్తములో చెల్లుపెట్టుకో గలవాడను. ఇది సమ్మతిన వ్రాయించి యిచ్చిన రశీదు.

యిందుకు సాక్షులు

సంతకము.

దస్తూరి.

## 1 వారసత్వేన సంక్రమించిన ఆస్తికి దావా.

గుంటూరు పి॥ డి॥ మునసబుకోర్టువారి సముఖమునకు

అసలు___1924

చల్లా లక్ష్మడు వాది

యెదిరి

1. బండారుపల్లి రాఘవయ్య యీన అవిభక్తకుమారుడు
2. యీ సుబ్బయ్య
3. యీడుపుల సోమయ్య

} ప్రతివాదులు

శివిల్ ప్రొశీజరు 26 శెక్షను ప్రకారం వాదిదావా

1. వాదివివరం
2. ప్రతివాదివివరం

3. తమ డి॥ యిలాకా గుంటూరు గ్రామములో ఇందుతో దాఖలుచేసిన వంశవృక్షము దాఖలా చల్లా శేషయ్య అనే ఆదిపురుషుడు కలడు. ఆయనకు 1 వెంకయ్య 2 భద్రయ్య 3 సోమయ్య అనే కుమాళ్లు కలరు. అందులో 1 వెంకయ్యకు రామయ్య అనే కుమార్డున్నూ 3 సోమయ్యకు 1 రాముడు 2 లక్ష్మణుడు 3 భరతుడు అనే కుమాళ్లు కలిగిరి 2 భద్రయ్యకు పుత్రపుత్రికా లేనందున 3 సోమయ్య కుమార్డు అయిన యీవాదిని దత్తు తీసుకొని వెళ్ళినాడు.

4. ఇట్లుండగా 1 వెంకయ్య ముందున్నూ తర్వాత 2 భద్రయ్యయున్ను పిదప 3 సోమయ్యయున్నూ కాలముచేసిరి. తరువాత 1 వెంకయ్య కుమార్డుఅయిన రామయ్య వివాహితుడయి నిస్సంతుగా యిప్పటికి

షుమారు 25 సంవత్సరములక్రిందట కాలముచేసినాడు. అయనకు వెంకమ్మ అనే భార్యయుండి ఆయన తాలూకు ఆస్తికి లైఫ్ ఇన్టరెస్టుతో ఆమె 4-10-23 తేదిన కాలముచేసినది. 3 సోమయ్యకుమార్లు అయిన 1 రామయ్య షుమారు 15 సంవత్సరములక్రిందట కాలముచేసినాడు. అయితే 1 రాముడికి శేషయ్య అనే కుమార్డు వుండివున్నాడు. 3 భరతుడు పుత్రసంతానములేక పుత్రికాసంతానము మాత్రము కలిగి 10-6-23 తేదీన కాలంచేసినాడు.

5. సదరు వెంకమ్మకు జీవనము వడ్డితో గుంటూరు గ్రామములో [a] షెడ్యూలు దాఖలా 10,000-0-0 లు విలువగల 1-2-3-4-5 అయిటముల స్థిరాస్తిన్ని [b] షెడ్యూలు దాఖలా రు 1000_0_0 లు విలువగల చరాస్తిన్ని [c] షెడ్యూలు దాఖలా లోకులవల్ల రావలసిన బాకీలున్నూ వుండివున్నవి. లోకులకు యివ్వవలసిన బాకీలు యేమి యులేవు.

6. రామయ్య భార్య అయిన వెంకమ్మకు యీవాది నియరస్టు అయివున్నాడు. వెంకమ్మచనిపోయిన దరిమిలా సదరు వెంకమ్మకు లైఫ్ యింటరస్టు కలిగిన ఆస్తికి యీవాది ముఖ్యవారసు అయివున్నాడు సదరు ఆస్తి యీవాదికి వారసత్వేన సంక్రమించినది.

7. సదరు వెంకమ్మకు లైఫ్ యింటరస్టు కలిగిన ఆస్తి వెంకమ్మకు వుపచారములు చేయువారు లేనందున ఆమె తమ్ముడయిన 1 ప్రతివాదిని తీసుకొనివచ్చి తన ఇంటిలోవుంచుకొని జిరాయితీ వగైరాలు చేయించు కుంటూవుండెడిది. ఆమెచనిపోయిన తరువాతకూడా షెడ్యూలుదాఖలా ఆస్తి 1, 2 ప్రతివాదుల స్వాధీనములోనే యుండియున్నది. లేటు వెంకమ్మ 3 వ ప్రతివాదికి 4_10_22 తేదిన షెడ్యూలుదాఖలా 4 అయిటముల భూమిని కవులుయిచ్చి వుండుటచేతనున్నూ సదరు 4 అయిటముల భూమి, 3 ప్రతివాది స్వాధీనములో వుండి వుండుటచేతనున్నూ 3 ప్రతివాదినిగూడా పార్టీగాచేర్చబడమయినది 2 వ ప్రతివాది 1 ప్రతివాది అవిభక్తకుమార్డు అయినందున్ననున్నూ షెడ్యూలుదాఖలా భూమి 2 వ ప్రతివాది స్వాధీనములోకూడా వున్నందుననున్నూ 2 వ ప్రతివాదినిగూడా పార్టీగాచేర్చబడమయినది.

8. రామయ్య భార్య అయిన లేటు వెంకమ్మ చనిపోయిన దరి మెలా ఆమెయొక్క లైఫ్‌యింటరస్టు నియరస్టు అయిన యీవాదికి సంక్రమించినది. గనుక 1 మొదలు 3 వరకు ప్రతివాదులు స్వాధీనములో [a] షెడ్యూలు దాఖలా 2 మొదలు 4 వరకు అయిటముల స్థిరాస్తిని [b] షెడ్యూలు దాఖలా చరాస్తిన్ని [c] షెడ్యూలు దాఖలా లోకులవల్ల రావలసిన బాకీలున్ను యీ వాదికి స్వాధీనపరిపించగలందులకు యీ దావా దాఖలు చేయడమయినది.

9. వ్యాజ్యకారణం లేటు రామయ్యగారి భార్య అయ్ని లేటు వెంకమ్మ చనిపోయినది 4_10_23 తేదిన తమ డి॥ యిలాకా గుంటూరు గ్రామములో కలిగినది.

10. దావావివరం.— లేటు వెంకమ్మతాలూకు వాదికి వారసత్వేన సంక్రమించిన వాదికి గల వారసత్వపు హక్కును స్థిరపించుటకు షెడ్యూలు దాఖలా 1, 2, 3 అయిటముల ఆస్తి శేరీనరస శిస్తు ప్రకారం 10 రేట్లప్రాప్తిని వాది మదింపు.

4 అయిటముల ఆస్తియీనాము వరుస క్విటిరెంటు ప్రకారం 15 రేట్ల ప్రాప్తిని వాదిమదింపులకు స్టాంపుడ్యూటీ దాఖలుచేయడమయినది.

11. కాబట్టి కోర్టువారు కరుణించి.— లేటు వెంకమ్మ తాలూకు వాదికి వారసత్వేన సంక్రమించిన 1, 2, 3, 4 అయిటముల ఆస్తియందు వాదికిగల వారసత్వపుహక్కును స్థిరపరిపించి 1, 2, 3 ప్రతివాదులు స్వాధీనముతప్పించి వాదికి స్వాధీనపరిపించవలెనని

2 దావాఖర్చులు కంటెస్టుచేయు ప్రతివాదులవల్ల యిప్పించవలెననిన్ని.

3 యింకా కోర్టువారికి యుక్తమని న్యాయమని తోచే అన్ని యితర పరిహారములతో వాది పక్షం డిక్రీ యిప్పించవలెననిన్ని ప్రార్థించుచున్నాడు. దివ్యచిత్తానకు తేవలయును.

ప్రమాణవచనము. వాది సంతకం

మకాం
తేది } వాది

షరా:— షెడ్యూళ్ళు దాఖలుచేయవలెను.

## 2 అద్దెకొరకు చేస్ని దావా.

మహారాజశ్రీ గుంటూరు డిస్ట్రిక్టు మునసబు కోర్టువారికి
స్మాల్ — 1922

మంతెన అప్పయ్య వాది
షేకు మౌలాసాహెబు ప్రతివాది

శి॥ ప్రొ॥ శె 26 ప్రకారం వాదిదావా

1. వాదివివరం
2. ప్రతివాదివివరం

3. తమ డి॥ యిలాకా గుంటూరుగ్రామంలో వాది దొడ్లా వెంకటరత్నం గారితావున మునిసిపల్ నె 14/190 రు గల డాబా కొట్టును అద్దె పుచ్చుకొని వుంటూవుండగా దుర్మతినామ సం॥ ఆశ్వజ శు 2 లకు సరియైన ది 3-10-21 తేదిన వాదితో ప్రతివాది 2 నెలల 15 రోజులకు నె 1కి రు 7-0-0 లు చొ॥ అద్దె యిచ్చేలాగునయున్న యేనెలఅద్దె ఆనెల యిచ్చి వాయిదా వెళ్ళినతరువాత వాదికి ప్రతివాది దావాకొట్టును స్వాధీనపరిచేలాగునయున్న ఆలా వాయిదా ఆఖరుకు స్వాధీనపర్చనియడల వాయిదా వెళ్ళిన తేదీలగాయతు నె1కి 10-0-0 లు చొప్పున కొట్టును స్వాధీనపరిచే వరకు అద్దె యిచ్చేలాగునయున్న యేర్పాటుచేసుకొని ఆ తేదీననే సదరుకొట్టును ప్రతివాది స్వాధీనపరచుకున్నాడు.

4. తరువాత వాదికి ప్రతివాది సదరు ఖరారుయొక్క రుజువు నిమిత్తం యిందుతో జతపర్చిన ది 3-10-21 తేదీగల చేవ్రాలుపత్రమును కూడా వ్రాసి యిచ్చినాడు.

5. వాదికి ప్రతివాది 3-10-21 తేదీ లగాయతు 18-11-21 తేది వరకు అనగా 2 నెలల 15 రోజులకు అద్దె యివ్వవలసిన వాయిదా వెళ్ళి పోయినప్పటికి వాదికి ప్రతివాది అద్దెను యిచ్చి యుండలేదు. అదిన్ని గాక ప్రతివాది సదరుకొట్టును యిప్పటివరకు తనస్వాధీనమందే వుంచుకొని వాడుకొంటూయున్నాడు.

6. వాదికి ప్రతివాది వాయిదా గతించిన తేదీలగాయతు అనగా

18-11-21 తేదీలగాయతు ప్రతివాది వ్రాసియిచ్చిన ఖరారుప్రకారం నె 1కి రు 10-0-0 లు చొ॥ అద్దె యిచ్చుటకు బద్ధుడయి వున్నాడు. సదరు ప్రకారం యిప్పటివరకు వాదికి ప్రతివాది రు 114-5-4 లు బాకీ దేలినాడు.

7. ఒక వేళ కోర్టువారు ప్రతివాది వ్రాయించియిచ్చిన వుత్తరం పనికిరాదని యెంచేయెడల వాదికి ప్రతివాది యూస్ అండ్ ఆక్యుపేషన్ క్రింద డామేజస్ రూపకముగా నయినను దావా మొత్తం యిచ్చుకొనుటకు బద్ధుడయి వున్నాడు.

8. సదరు బాకీనిగురించి వాది ప్రతివాదికి రిజష్టరీ వుత్తరం ఇచ్చి తగాదా వచ్చినను చెల్లుయేమీ యిచ్చివుండలేదు.

9. వ్యాజ్యకారణం వాదితాను ప్రతివాది దావాకొట్టునుఅద్దెకు పుచ్చుకుని స్వాధీనపర్చుమన్న దరిమిలా వుత్తరం వ్రాసియిచ్చిన దుర్మతి నామ సం॥ ఆశ్వీజ శు 2 లకు సరియైన ది 3-10-21 తేదీన తమ డి॥ యిలాకా గుంటూరు గ్రామములో కలిగినది.

10. దావావివరం:—

| | |
|---|---|
| నె 1కి రు 7-0-0 లు చొప్పునవాదికి ప్రతివాది 3-10-21 మొదలు 18-11-21 తేదీవరకు యివ్వవలసిన అద్దె | 17-8-0 |
| 18-11-21 మొదలు 10-10-22 వరకు నె 1కి రు 10 లు చొప్పున యివ్వవలసిన అద్దె | 107-5-4 |
| మొత్తం రు. | 124-13-4 |

లకు స్టాంపుడ్యూటీ రు 9-12-0 లు దాఖలు చేయడమయినది.

11. కాబట్టి వాదితరఫు విమర్శించి

(a) దావా మొత్తమున్ను (b) దావా ఖర్చులున్ను (c) దావా తేదీలగాయతు సొమ్ము ముట్టేవరకు లేక నూటికి రు 1-9-0 చొప్పున దరిమిలా వడ్డీతో వాదికి ప్రతివాది యిచ్చుకునే లాగున వాదిపక్షం డిక్రీ యిప్పించమని వాది ప్రార్థించుచున్నాడు.

దివ్యచిత్తమునకు తేవలయును.

దస్కతు వాది

ఇందులోని సంగతులు నేను స్వయముగా యెరిగివుండి యదార్థమని ప్రమాణముమీద తెలియజేయుచున్నాను.

మకాం గుంటూరు, తేది 10-10-22. } దస్కతు వాది.

దస్తావేజులిష్టు దాఖలు చేయవలెను.

| నంబరు | తేది | పార్టీల వివరం | దస్తావేజువివరం |
|---|---|---|---|
| 1 | 3-10-21 | వాది ప్రతివాదికి వ్రాయించియిచ్చిన | చేవ్రుత్తరం. |

## 3 తాకట్టు దస్తావేజునుబట్టి చేసిన దావా.

మ॥ రా॥ శ్రీ గుంటూరు ప్రి॥ డి॥ మునసబ్ కోర్టువారికి.

అసలు—1924

అందె కృష్ణమూర్తి వాది

ఎదిరి

తీర్థాల వెంకటకృష్ణయ్య ప్రతివాది

శి॥ ప్రొ॥ శె॥ 24 ను ప్రకారం వాది దావా.

1. వాది తెలగజిరాయతి అందె రామమూర్తి కుమారుడు షుమారు 30 సం॥ ముల వయస్సుగల కృష్ణమూర్తి సా॥ వెలగపూడి. వాది విలాసము మంగళగిరిపోస్టు.

2. ప్రతివాది బ్రాహ్మణులు ఈనాములు తీర్థాల వెంకటప్పయ్యగారి కుమారుడు షుమారు 5 సం॥ వయస్సుగల వెంకటకృష్ణయ్య సా॥ కురగల్లు.

3. ప్రతివాదికి చెందివున్న భూమిని వాది తాకట్టు పెట్టించుకున్నాడు.

[ఎ. తారీఖు]— 13-7-17

[బి. తాకట్టు పెట్టించుకున్నవారిపేర్లు పెట్టినవారిపేర్లు]— వాది అందె కృష్ణమూర్తికి 13-7-17 తేదీగల తాకట్టు దస్తావేజు ప్రతివాది తీర్థాల వెంకటకృష్ణయ్య స్వయముగా వ్రాయించి యిచ్చినాడు.

[సి. తాకట్టుపెట్టబడిన మొత్తం]— 13-7-17 తేదీగల

తాకట్టు మొత్తం అసలు రు 300 లు మూడువందల రూపాయిలు.

[డి. వడ్డీరేట్లు]— సదరు మొత్తముకు నె 1 కి నూటికి రు 1 చొ॥ మూడు సంవత్సరములకు ఒకపర్యాయము అసలులో కలుపుకుని వడ్డీకివడ్డీ ఇచ్చేలాగున.

[ఇ. తాకట్టు పెట్టబడిన ఆస్తి]— గుంటూరు డి॥ మంగళగిరి సబు డి॥ లో చేరిన కురగల్లు గ్రామంలో నావగ్గైరాలపేర పట్టా గలిగినటువంటిన్ని నాకు హక్కు భుక్తమౌతూ వున్న డి॥ నెం॥ 216 రు యఫ్ గుర్తు రు 5-12-0 సిస్తుగల య 4_50 శెంట్ల మెరక ఈనాం భూమి.

[యఫ్. ఇప్పుడు బాకీవున్న మొత్తం]— రు 554-14-0

[జి. వాదులకు గలహక్కు]— తాకట్టుహక్కు.

4. సదరు బాకీనిగురించి వాది ప్రతివాదికి రిజష్టరీ వుత్తరం యిచ్చి తగాదాసర్చినను చెల్లు యేమీ ఇచ్చివుండలేదు.

5. వ్యాజ్యకారణం దావాతాకట్టు దస్తావేజు పుట్టిన ది 13-7-17 తేదీన తమ డి॥ యిలాకా కురగల్లు గ్రామంలో కలిగినది.

6. దావావివరం.

| | | |
|---|---|---|
| | తాకట్టు అసలు | రు 300_0_0 |
| 13_7_17 | మొదలు 13_7_20 వరకు నె 1కి నూటికి రు 1 చొ॥ వడ్డీ | రు 108_0_0 |
| | మొత్తం | రు. 408-0-0 |
| 13_7_20 | మొదలు 13_7_23 వరకు నె 1కి నూటికి రు 1 చొ॥ వడ్డీ | రు. 146-14-0 |
| | మొత్తం | రు. 554_14_0 |

లకు స్టాంపుడ్యూటీ రు 62-15-0 లు దాఖలు చేయడమైనది.

7. కాబట్టి వాదితరఫు విమర్శించి.

(ఎ) దావా మొత్తమున్ను (బి) దావాఖర్చులున్ను (సి) దావా తేదీలగాయతు సొమ్ము ముట్టేవరకు నె 1కి నూటికి రు 1చొ॥ దరిమిలావడ్డీతో వాదికి ప్రతివాది కోర్టువారు నిర్ణయించే హాయిదా

లోగా యిచ్చుకునేలాగునున్నూ (డి) అలా వాయిదానాటికి సొమ్ము చెల్లించనియెడల ఇందుతో జతపర్చిన జాబితా దాఖలా తాకట్టుఆస్తిని వేలం వేయించి సొమ్ము వసూలు పరిపించి యిప్పించవలెననిన్ని (ఇ) తాకట్టు ఆస్తివల్ల వసూలు అయిన సొమ్ము చెల్లుపోను నిల్చివుండే మొత్తమును స్వయముగాను యితర ఆస్తివల్లనున్నూ యిచ్చుకునేలాగునున్నూ (యఫ్) ఇంకా కోర్టువారికి యుక్తమని న్యాయమని తోచే అన్ని యితర పరిహారములతో వాదికి ప్రతివాది యిచ్చుకునేలాగున వాదిపక్షంగ డిక్రీ యిప్పించవలెనని వాది ప్రార్థించుచున్నాడు.

దివ్యచిత్తానకు తేవలెను.

సంతకం వాది

ఇందులోని సంగతులు నేను స్వయముగా యెరిగివుండి యదార్థమని ప్రమాణముమీద తెలియజేయుచున్నాను.

గుంటూరు 13-7-1923 } సంతకం వాది

వరా:- షెడ్యూలుకాపీ వేరే వ్రాసి ప్లయింటుతో జతపర్చవలెను.

# అద్దెకున్నూ ఇల్లుస్వాధీనమునకున్నూ చేస్నిదావా.

మహారాజశ్రీ గుంటూరు ప్రినిసిపల్ డిస్ట్రిక్టుమునసబుకోర్టువారికి

అసలు—/1924

బొందిలి నారాయణసింగ్ మయినరు అయినందున నెక్స్టట్ ఫ్రెండు తాత మోహన్‌సింగ్ } వాది

1 కోసూరు సుబ్బులింగు
2 బొందిలి శీతారాంసింగ్ } ప్రతివాదులు

శి॥ ప్రొ॥ శె॥ 26 ను ప్రకారం వాది దావా

1. వాది వివరం
2. ప్రతివాదుల వివరం— డిస్క్రిప్షన్
3. తమ డి॥ యిలాకా మెనమదల గ్రామములో దావాయిం

టిని వాదితండ్రి గుంటూరు ప్రిన్సిపల్ డిస్ట్రిక్టుకోర్టు ఫైలు—560/14 240/18 రులో జరిగిన బహిరంగ వేలములో రు 100—0—0 లకు కొన్నాడు. సదరువేలం ది 20_4_19 తేదీన కాయపడినది; కోర్టువారు ఇందుతో జతపర్చిన కబేలాను ఇచ్చినారు. ఆ ఇల్లుకోర్టుద్వారా వాది తండ్రి స్వాధీనపర్చుకొన్నాడు.

4. తరువాత వాదితండ్రివద్ద 1 ప్రతివాది నె 1 కి రు 1_8_0 చొ॥ అద్దె ఇచ్చేపరతుతో సదరు ఇంటిని అద్దెకుపుచ్చుకొని అప్పుడే ఇంటిని అనగా ది 24_5_20 తేదీన స్వాధీనపర్చుకొని ఇందుతో జత పర్చిన అద్దెకాగితమునుకూడా వ్రాసి యిచ్చినాడు.

5 పిమ్మట 1 ప్రతివాది అద్దెక్రింద రు 16_0_0 లు మాత్రము ఇచ్చినాడు. తతిమ్మా బాకీ ఇంతవరకు యిచ్చి వుండలేదు. సదరు మొత్తము 1 ప్రతివాదివల్ల రావలసివున్నది.

6. 2 ప్రతివాదిని కూడా 1 ప్రతివాది సదరు ఇంటిలో వుంచుకున్నట్టు తెలిసినది. అందువల్ల 2 ప్రతివాదినికూడా పార్టీగాచేర్చడమైనది.

7. సదరు అద్దెసొమ్ము రాబట్టుకొనుటకు పైనజెప్పిన అద్దెకాగితము చెల్లదని కోర్టువారుఎంచేయెడల యూస్ అండ్ ఆక్యుపేషన్ క్రింద డామేజ రూపకముగానైనను సదరు మొత్తం ఇంట్లోవున్న 1-2 ప్రతివాదులు ఇచ్చుటకు బద్ధులయివున్నారు.

8. సదరు అద్దెమొత్తమును యిచ్చిఇంటిని ఖాలీచేయవలసినదని వాది ప్రతివాదులకు రిజష్టరునోటీసునుయిచ్చి తగాదాపర్చినను, అద్దె యిచ్చుటగాని, యిల్లుఖాలీచేసివాదికి స్వాధీనపర్చుటగాని జరిగించి యుండలేదు.

9. వ్యాజ్యకారణం దావాయింటిని అద్దెకుపుచ్చుకొని స్వాధీనముచేసుకున్న 24_5_20 తేదీననున్నూ దరిమిలానున్నూ తమ డిటో యిలాకా మొనమదల గ్రామములో కలిగినది.

10 దావావివరం

| | |
|---|---|
| 24_5_20 లగాయతు 5-10-22 వరకు నె1కి రు 1_8_0 చొప్పున అద్దె | 42_8_0 |
| అద్దెక్రింద యిచ్చిన చెల్లు | 16_0_0 |
| | 26_8_0 |
| యింటిని వాదిస్వాధీన పర్చుటకు ఇంటిఖరీదు | 100_0_0 |
| స్టాంపుడ్యూటి | 126_8_0 |

రు 14__9__0 లు దాఖలుచేయడమైనది

11. కాబట్టి వాదితరపు విన్నవించి,

[a] దావాఇంటిని వాదికి ప్రతివాదులవల్ల స్వాధీనపరిపించవలెననిన్ని

[b] దావామొత్తమున్ను

[c] దావాఫయిసలు అయి దావాయిల్లు వాదికి ప్రతివాదుల స్వాధీనపర్చేవరకు సదరు రేటు ప్రకారము నె 1 కి రు 1_8_0 చొప్పున వాదికి ప్రతివాదులు అద్దె యిచ్చుకునేలాగుననున్నూ

[d] దావాఖర్చులున్ను

[e] యింకాకోర్టువారికి యుక్తమని న్యాయమని తోచేఅన్ని ఇతరపరిహారములతో వాదిపక్షం డిక్రీ యిప్పించవలెనని వాది ప్రార్థిస్తూయున్నాడు.

దివ్యచిత్తానకు తేవలెను.

దస్కతు వాది.

ఇందులోనిసంగతులు 3 పేరాలోని సంగతులు వినికి నమ్మికలమీదను 4 మొదలు 11 పేరలలోని సంగతులు స్వయముగాను యెరిగివుండి యదార్థమని ప్రమాణముమీద తెలియజేయుచున్నాము.

మకాం గుంటూరు
తేది 5__10__22

దస్కతు వాది.

## ఖరారు రశీదునుబట్టి చేస్ని దావా.

మ॥ రా॥ శ్రీ గుంటూరు ప్రి॥ డి॥ మునసబు కోర్టువారికి

అసలు /1924

గొల్లపూడి పిచ్చయ్య వాది

ఎదిరి

వెలగా రామయ్య ప్రతివాది

శి॥ ప్రొ॥ శె॥ 26 రు ప్రకారం వాదిదావా

1. వాదివివరం డిస్క్రిప్షన్

2. ప్రతివాది వివరం డిస్క్రిప్షన్

3. తమ డి॥ యిలాకా వెంగళాయపాలెం గ్రామంలో వాదికి ప్రతివాదులు గ్రేటునార్దర్న్ రోడ్డు 246, 247 మైళ్ళకు నల్లపాటి కొండముక్కరాయి యూనిటి 1 కి రు 4_0_0 లు చొ॥ తోలేటట్టు యేర్పాటు చేసుకుని అందుమింజుమలె వాదితావున ప్రతివాది రు 300_0_0 పుచ్చుకుని వాదిపేరటికి ప్రతివాది యిందుతో జతపర్చిన ది 12—5—1921 తేదీగల రశీదును వ్రాయించి యిచ్చినాడు.

4. సదరు బాపతు వాదికి ప్రతివాదులు రు. 52_0_0 లకు 12_4_22/13 యూనిటీల ముక్కరాయినిమాత్రము తోలినారు. మిగతా తోలవలసిన ముక్కరాయిని తోలక కంట్రాక్టుకు భిన్నముగా నిరాకరించినారు.

5. సదరు ముక్కరాయి తోలవలసిన బాపతు వాదికి ప్రతివాది కంట్రాక్టు ప్రకారము వడ్డీసహా రు లు డామేజస్ పూర్వకముగానైనను ఇచ్చుటకు బద్ధుడయి వున్నాడు.

6. సదరు బాకీనిగురించి వాది ప్రతివాదిని తగాదాపర్చినను చెల్లుయేమీ యిచ్చి వుండలేదు.

7. సదరు బాకీ ఆచారప్రకారమున్ను ఖరారుప్రకారమున్నూ నె 1 కి నూటికి రు 1—0—0 చొ॥ వడ్డిన్ని యిచ్చుటకు బద్ధుడయివున్నాడు.

8. వ్యాజ్యకారణం దావాకంట్రాక్టు రశీదుపుట్టినది 3_5_1921 తేదీనన్నూ కంట్రాక్టు ప్రకారం ముక్కరాయి తోలక నిరాకరించిన దరిమిలానన్నూ తమ డి॥ యిలాకా వెంగళాయపాలెం గ్రామంలో కలిగినది.

9. దావావివరం

12_5_21 కంట్రాక్టు రశీదు ప్రకారంఅసలుమొత్తం రు 300-0_0

12_5-21 మొదలు 12_4_23 వరకు నె 1 కి రు 1-0-0

చొ॥ వడ్డి 69-0-0

| | | |
|---|---|---|
| కిచెల్లు 12 4 22 తేదీన | 52 0 0 | 369 0 0 |
| 12-4-22 మొదలు 12-4-23 వరకు నె 1 కి 1-0-0 చొ॥ వడ్డి | 6 3 10 | |
| | 58 3 10 | 58 3 10 |
| | | 310 12 2 |

స్టాంపుడ్యూటి రు 23-0-0 లు దాఖలు

10 కాబట్టి వాదితరపు విమర్శించి

[a] దావామొత్తమున్ను [b] దావాఖర్చులున్ను [c] దావా తేదీలగాయతు సొమ్ముముట్టేవరకు నె 1 కి నూటికి రు 1 0 0 చొ॥ దరిమిలావడ్డీతో వాదికి ప్రతివాది యిచ్చుకునేలాగున వాదిపక్షం డిక్రీయిప్పించవలెనని వాది ప్రార్థిస్తూయున్నాడు.

దివ్యచిత్తానకు తేవలెను.

దస్కతు వాది

ఇందులోని సంగతులునేను స్వయముగా యెరిగివుండి యదార్థ మని ప్రమాణముమీద తెలియజేయుచున్నాను.

మకాం గుంటూరు.<br>తేది 12 4 23 } దస్కతు వాది

# అవార్జిపరిచి వ్రాసియిచ్చిన చేవ్రుత్తరమును బట్టి చేసిన దావా

మ॥ గుంటూరు ప్రి॥ డి॥ మున్సిఫ్‌కోర్టువారికి

అసలు —/1924

౧ శింగంపల్లి వెంకట్రామయ్య చనిపోయినందునముఖ్య వారసు అవిభక్తకుమారుడు శింగంపల్లి వెంకటసుబ్బారావు } వాది

ఎదిరి

రాయసం రామయ్య చనిపోయినందున ముఖ్యవారిసు

అవిభక్తకుమారుడు 1. రాయసం వెంకయ్య
2. పెనుగొండ కామయ్య } ప్రతివాదులు
3. యీ వెంకటరంగయ్య

శి॥ ప్రా॥ శెక్షను 26 ప్రకారము వాదిదావా

1. వాది బ్రాహ్మణులు, ఈనాములు, శింగంపల్లి వెంకట్రామయ్య కుమారుడు షుమారు 50 సం॥ లు వయస్సుగల సుబ్బారావు సా॥ గుంటూరు. వాది అడ్రెసు డిటో.

2. ప్రతివాదులు వైశ్యులు వర్తకం 1 రాయసం రామయ్య కుమారుడు షుమారు 35 సం॥ ల వయస్సుగల వెంకయ్య 2 పెనుగొండ వెంకయ్య కుమారుడు షుమారు 40 సం॥ ల వయస్సు గల కామయ్య 3 షుమారు 35సం॥ల వయస్సుగల యీ వెంకటరంగయ్య సా॥ గుంటూరు

3 కంచకచర్ల నె 2రు ఫ్యాక్టరీలో ఉభయపార్టీలున్ను ఇంకా కొంతమందిన్ని భాగస్తులుగా వుంశిపున్నారు. సదరు ఫ్యాక్టరీవిషయములను ఫయిసలుచేసుకునే సందర్భములో 2 ప్రతివాది వాదితండ్రికిఇవ్వవలసిన పయికమును 1 ప్రతివాది తండ్రివద్ద నిలవున్న రు. 800-0-0 లు తీసుకోవలసినదిగా వాది తండ్రి పేరటికి 2 ప్రతివాది యిందుతో జతపరిచిన ది 14-6-21 న చేవ్రాలుతుము వ్రాసియిచ్చినాడు.

4. సదరుసొమ్ము 1 ప్రతివాదితండ్రివద్దవున్నట్లును ఆమొత్తమును వాదితండ్రికి యిచ్చునట్లున్ను 1 ప్రతివాదితండ్రిఒప్పుకొని దాని ననుసరించి 1 ప్రతివాదితండ్రి 2 ప్రతివాదికి రశీదుకూడా వ్రాసియిచ్చినాడు. సదరుపయికము తనతావున డిపాజిట్ గావున్నట్టు 1 ప్రతివాదితండ్రి అచ్చుకాగితములుకూడా వేసివున్నాడు.

5. వాదితండ్రి వాదితో అవిభక్తుడుగావుంటూ షుమారు 2 సం॥ ల క్రిందట కాలంచేసినాడు. ఆయనతాలూకు యావదాస్తి రయిటాఫ్సర్వయివర్షిప్ద్వారా యీవాదికి సంక్రమించినది. ఇంతకంటె ముఖ్యవారసులు మెవరూలేరు.

6. 1 ప్రతివాదితండ్రి 1 ప్రతివాదితో అవిభక్తుడుగా వుటూ షుమారు $1\frac{1}{2}$ సం॥ క్రిందట కాలంచేసినాడు. ఆయన తాలూకు యావదాస్తి రయిటాఫ్ సర్వాయివర్‌షిప్ ద్వారా 1 ప్రతివాదికి సంక్రమించినది. ఇతకంటె ముఖ్యవారసులు యెవరూ లేరు.

7. వాది 1 ప్రతివాదితండ్రి జీవించియుండగా ఆయననున్నూ దరిమిలాను యీప్రతివాదులనున్నూ దావాసొమ్ము యివ్వవలసినదని తగాదాపరిచినను చెల్లుయేమీ యిచ్చివుండలేదు.

8. 1 ప్రతివాదిగాని 1 ప్రతివాదితండ్రిగాని యివ్వలేదని 2, 3, ప్రతివాదులను నడిగినను సొమ్మియిప్పించలేదు. 2 ప్రతివాదిఅయినను యివ్వక కాలయాపనము చేయుటవల్లనున్ను 2, 3, ప్రతివాదుల కుటుంబలాభమునిమిత్తం కుటుంబమేనేజింగుమెంబరయిన 2 ప్రతివాది వలనచేయబడిన బాకీఅయినందుననున్నూ 2, 3, ప్రతివాదులనుకూడా పార్టీలనుగా చేర్చడమయినది. ఒకవేళ 1 ప్రతివాగి దావాసొమ్ము ఇచ్చుటకు వీలులేదని ఎంచినను 2, 3, ప్రతివాదులు ఇచ్చుటకు బద్ధులయియున్నారు.

9. వ్యాజ్యకారణం 2 ప్రతివాది దావాబాకీమొత్తమును ఇచ్చుటకు 1 ప్రతివాదితండ్రిమీద అవాప్తిచేసి చేవుత్తరం వ్రాసియిచ్చిన 14-6-21 తేదీన తమ డి॥ యిలాకా గుంటూరుగ్రామంలో కలిగినది.

10. దావావివరం

ఇందుతో జతపరిచినవుత్తరం ప్రకారం వాదికి

ప్రతివాదులు ఇవ్వవలసిన మొత్తం రు 800-0-0

లకు స్టాంపుడ్యూటి రు 89-15-0 లు దాఖలా

11. కాబట్టి వాదితరఫు విమర్శించి

(a) దావామొత్తమున్ను (b) దావాఖర్చులున్నూ (c) దావాతేదీలగాయతు సొమ్ము ముట్టేవరకు నె1కి 100కి రు 0-8-0 చొప్పున దరిమిలా వడ్డీతో 1, 2, 3, ప్రతివాదులు వాదికి ఇచ్చుకునేలాగున వాదిపక్షం డిక్రీ ఇప్పించవలెనని వాది ప్రార్థించుచున్నాడు.

దివ్యచిత్తానకు తేవలయును

సంతకము వాది

ఇందులోనిసంగతులు నేనుస్వయముగా యెరిగియుండి యదార్థ మని ప్రమాణముమీాద తెలియజేయుచున్నాను.

మకాం గుంటూరు, } సంతకము వాది
తేది 20-12-23. }

# మనోవర్తికొరకు దాఖలు చేసిన దావా.

మ॥ రా॥ శ్రీ గుంటూరు ప్రి॥ డి॥ మునసబు కోర్టువారికి.

అసలు——/1924

1 మంగెనపూడి శీతమ్మ 2 యీా మోహనాంగి మైనరు అయినందున తల్లి n. f, & 1 వ వాది } వాదులు

1 మంగెనపూడి శీతాకాంతం 2 యీా రత్నయ్య 3 యీా సోమయ్య } ప్రతివాదులు

శి॥ ప్రొ॥ శె॥ 26 రు ప్రకారం వాదిదావా.

1. వాదులవివరం

2. ప్రతివాదుల వివరం.

3. 1వ వాదికి 2వ వాది కుమార్తెయున్ను 1వ ప్రతివాది మామగారున్నూ 2వ ప్రతివాది భర్తయున్నూ 3వ ప్రతివాది మరిదిన్ని అయివున్నారు.

4. 1వ వాదికి 2వ ప్రతివాది హిందూ ధర్మశాస్త్రప్రకారం షుమారు 15 సంవత్సరముల క్రిందట వివాహము చెసుకుని తర్వాత కొన్నాళ్ళకు 4—5 సంవత్సరములు కాపురము చేసినాడు, యీాకాలములో 1వ ప్రతివాదికి కుమార్తెయున్ను 2, 3 ప్రతివాదులకు అక్కయున్ను అయిన శేషమ్మయొక్కయు తదితరులయొక్కయు దుర్బోధనలచేత, 1వ వాది 2 కురూపిఅని మిష పెట్టి ఇంకాకొన్ని ఇతర కారణముల చేతనున్ను ఎక్కువగా కష్టపెడుతూ వచ్చినారు. 1వ వాది ఆ కష్టముల కన్నిటికిని లోబడి ఎప్పటికైనా దైవానుగ్రహమువల్ల మంచికాలము వచ్చుకుగదాయని వోర్పుతో కాలము గడుపుతూవుండెను.

5. తర్వాత కొంతకాలముకు 2వ వాది కలిగినది. అప్పుడు 1వ వాది తనయొక్క కష్టములు గట్టు ఎక్కువనని సంతోషముతో ఉం

డగా 2వ ప్రతివాది అక్కకు 1వ వాదికి 2వ వాది పుట్టుట ఇదివరకు వున్న ఈర్ష్య ఎక్కువగా అభివృద్ధి అయి మరింత కష్టములపాలు చేయుచూ వచ్చెను.

6. 2,3 ప్రతివాదులకు అక్కయున్నూ 1వ ప్రతివాదికి కుమార్తెయున్ను అయిన శేషమ్మయొక్క దుర్బోధనల చేత 1వ వాది యొక్క నగలనన్నిటిని తీసుకుని ఇంటిలోనుండి 1, 2 వాదులను 1 మొదలు 3 ప్రతివాదులు వెళ్ళగొట్టినారు. పిల్లజనించిన లగాయతు కూడా పోషణ ఎంతమాత్రము జరుగనందున మంచిరోజులువచ్చునని ఆశతొలిగిపోయినది. పెద్దమనుష్యులచేత చెప్పించినను ప్రయోజనము లేకపోయినది. అందువల్ల 1, 2 వాదులకు వేరే గత్యాంతరము లేక తండ్రిగారిఇంటికి వెళ్ళవలసివచ్చినది. తరువాత ఎన్నిపర్యాయములు తీసుకుని వెళ్ళి పోషించవలసినది అని పెద్దమనుష్యులచేత కబురుచేసినను వచ్చి తీసుకుని వెళ్ళలేదు.

7. కాలము కటువుగావుండుటవల్లనున్ను వాదులకు జీవనము జరుగుట దుర్ఘటముగానుండుటచేతనున్నూ లాప్రకారం జీవనార్థంతగిన వసతులను ఏర్పాటుచేసికొనుటకు యుద్యుక్తురాలై ప్రతివాదులకు 20-12-23 తేదీన రిజష్టరుఉత్తరం ఇచ్చినది. అది ప్రతివాదులకు సక్రమముగా అందినది. అందుకు పేచీసంగతులతో జవాబుఇచ్చినారు. సదరు జవాబులోని సంగతులు న్యాయమైనవిన్ని చెల్లతగినవిన్ని కావు.

8. వాదులు పడుచూయున్నకష్టములు ఇంతింతయని చెప్పుటకు వీలుకాదు. కాటకపురోజులలో మనిషి 1 కి నెలకు రు 15 0 0 లు కావలసివుండును పిల్లకుఅయిదు రూపాయలు అయినను కావలసివుండును. ఇద్దరికి రు 20-0-0 లు కావలసివుండును. వంటిమీద వస్తువులు అయినను లేక చాలా కష్టపడుతూవున్నారు.

9. ప్రతివాదులకు బండారుపల్లి గ్రామములో య 30 ల భూమిన్ని పేరేచర్ల గ్రామంలో య 20 0 0 భూమిన్ని తురకపాలెంలో య 15 ల భూమిన్ని వుండివున్నది. అదియునుంగాక 2 ప్రతివాది సంగీతములో మహాప్రవీణుడు. నె 1 కి రు 300-0-0 లకు తక్కువలేకుండా సంపాదించగలడు. లోకులవల్ల రు 10000-0-0 లు

రావలసివున్నవి. అందువల్ల వాదులుకోరే మనోవృత్తిఇచ్చుటకు ప్రతి వాదులకు ఎంతమాత్రము అభ్యంతరముపుండదు.

10 అదిన్నిగాక సంవత్సరమునకు రు 30-0-0 లు గుడ్డలుకావలసివుండును. 2 వ వాది వివాహముచేయవలసి వుండును. ఇప్పటికి ఆపిల్లకు 10 సంవత్సరములు వుండివున్నవి. పెండ్లికి ఇంకాఆపుటకు వీలులేదు. కాలానుగుణ్యముగా తగినవరుని విచారించి వివాహముచేయవలసివుండును. వివాహపుఖర్చుల క్రింద అధమము వెయ్యిరూపాయలు అయినను కావలసివుండును. హిందూధర్మశాస్త్ర ప్రకారము ప్రతివాదులు ఇవ్వవలసివున్నారు.

11. గనుక 1 వ వాదికి నె 1 కి రు 15 0 0 లున్ను 2 వ వాదికి నె 1 కి రు 5 0 0 లున్ను వస్త్రముల క్రింద రు 30 0 0 లున్ను వంటసామాగ్రిన్ని వుండుటకు ఇల్లున్నూ లేనియెడల ఖరీదు రు 200-0-0 లున్ను ప్రతివాదులవల్ల రావలసివున్నవి. ఆస్తిని లాలూచీ విక్రయము చేసి మనోవృత్తికి ఆస్తిలేకుండా చేయవలయుననే దుష్ప్రయత్నములో వున్నట్టుకూడా తెలుస్తుంది. గనుక పెడ్యూలు దాఖలా ఆస్తిని సదరు మొత్తముకు చార్జీగా వుంచవలసివున్నది. మెయింటునెన్సు నిమిత్తము యీదావా దాఖలుచేయడమైనది.

12 సదరు ప్రకారం 1, 2 వాదులను ఇంటినుంచి వెళ్ళగొట్టిన 10 సంవత్సరములకు గతకాలమునకు మనవర్తికూడా ఇచ్చుటకు ప్రతివాదులు బద్ధులయియున్నారు.

13. వ్యాజ్యకారణం 1, 2 వాదులను ఇంటిలోనుంచి వెళ్ళగొట్టిన షుమారు 10 సంవత్సరము ఆప్రాంతములందున్ను డిమాండుచేస్తూవున్న దరిమిలా కాలమునుంచిన్ని మనోవృత్తి ఇవ్వవలసినదని కోరగా నిరాకరణచేసిన 26 12-23 తేదీసనున్ను తమ డి॥ యిలాకా బండారుపల్లిగ్రామములో కలిగినది.

14. దావావివరం

1వ వాదికి నె1కి రు 15-0-0 లచొప్పున

| | |
|---|---|
| 1 సంవత్సరమునకు | 180-0-0 |
| 2వ వాదికి నె1కి రు 5-0-0 లచొప్పున 1 సం॥ నకు | 60-0-0 |

| | |
|---|---|
| వస్త్రములక్రింద | 30-0-0 |
| సదరుప్రకారం 10 సం॥ లకు పాస్టు మనవర్తి | 2400-0-0 |
| ఇల్లు లేక ఇంటిఖరీదు | 200-0-0 |
| | 2870-0-0 |

ష్టాంపుడ్యూటీ ఇచ్చుకొనుటకు శక్తిలేకనున్న లాప్రకారం ఏమి ఆస్తిలేకపోవుటచేత పాపర్‌గా దాఖలుచేయుటకు ఆర్డరు ఇప్పించుటకు ప్రార్థించడమయినది.

15. కాబట్టి కోర్టువారు విమర్శించి

1. పాపరుపిటీషను అంగీకరించి దావాను పాపరుగా జరుగుటకు పర్మిషన్ యిప్పించవలెననిన్ని

2. పయిప్రకారం 1 వ వాదికి నె1కి రు 15-0-0 లున్న్నూ 2వ వాదికి నె1కి రు 5-0-0 లున్ను మనోవర్తి ఇప్పించవలెననిన్ని

3. వస్త్రములక్రింద సం॥ 1కి రు 30 లచొప్పున యిప్పించవలెననిన్ని

4. గతకాల మనవర్తి సదరుప్రకారం 10 సంవత్సరములకు యిప్పించవలెననిన్ని

5. ఇల్లుగానిలేక ఇంటిఖరీదు రు 200-0-0 లు ఇప్పించవలెననిన్ని

6. సదరు సొమ్ముకు షెడ్యూలుదాఖలా ఆస్తిని ఛార్జిగా వుంచుటకు వుత్తర్వు యిప్పించవలెననిన్ని

7. దావాఖర్చులున్ను

8. ఇంకాకోర్టువారికి న్యాయమనితోచే అన్ని పరిహారములతో వాదులపక్షం డిక్రీ ఇప్పించవలెనని వాదులు ప్రార్థించుచున్నారు.

షరా:— 1 వివాహపుఖర్చులకు వేరేదావా దాఖలుచేయబడును. 2 యీదావా ప్లెయింటు పాపరుపిటీషనుగానున్ను, ఇదియె మనవర్తిదావా ప్లెయింటుగానున్ను వాడవచ్చును. 3 పిల్లలులేనియెడల తనకే మనవర్తికావలయునని వ్రాయవచ్చును. 4చరాస్తి వంటసామగ్రి ఇవ్వవలశినదని వ్రాయవచ్చును. 5 యీ దావా ప్లెయింట్లతో ఆస్తి షెడ్యూళ్ళు దాఖలుచెయ్యవలెను.

## 8 హక్కు స్థిరపరిపించుటకు దావా

గుంటూరు ప్రిన్సిపల్ కోర్టులో

అసలు 194/24

మంగెనపూడి సుబ్బరామయ్య — వాది

పప్పుల రామయ్య — ప్రతివాది

శి॥ ప్రొ॥ శె॥ 26 ప్రకారం వాదిదావా

1. వాదివివరం

2. ప్రతివాది వివరం

3. తమ డి॥ యిలాకా యేటుకూరుగ్రామంలోని బౌండరీలో కనుపరిచిన ప్లానుదాఖలా A మార్కు (B C D E F G H I) మార్కుల స్థలమునువాది సత్తెనపల్లి గ్రామకాపురస్థుడు వింతా మాధవయ్యగారి వల్ల 4_9_1902 తేదీన రు 100 లకు విక్రయుంచుకొని ఆరోజునసే వాది స్వాధీనపర్చుకుని తతాదియూనియన్ పన్ను వగయిరాలు వాడే చెల్లించుచు నిర్వివాదముగా అనుభవిస్తూ వున్నాడు.

4. ప్రతివాదికి వీధిలోకి పోవుటకు తూర్పుగా నడుచునట్టి ఆచారమువుండివున్నది. అయితే వాది విరోధుల కుట్రవల్ల వాదిని నష్టపర్చవలయుననే దురుద్దేశ్యముతో. BC మార్కు గోడ B మార్కునుంచి ఒకగజముపొడుగున K మార్కువద్ద పగులగొట్టి అక్రమముగా వాకిలి పెట్టినాడు. ఆసంగతినాడికి తెలిసి అడ్డుపెట్టినను బలవంతుడగుటచేత, కొందరి దుస్సలహాలచేత, నెట్టివేసినాడు. దానివిషయమై క్రిమినల్ చార్జి కూడా పెట్టినాను. పెండింగులో వున్నది.

5. ఇప్పుడు K మార్కువాకిలిగుండా వాదితాలూకు A మార్కు స్థలమును ఆక్రమించుకొని వుపయోగించుకుని నడవవలయునని ప్రయత్నిస్తూవున్నాడు. ఆలాచేయుటవల్ల ఈవాదికిచాలానష్టము కలుగును. సదరు K మార్కువాకిలిని పెట్టుటకుగాని దానిగుండా A మార్కు స్థలములోకి నడచుట వగయిరా పనులనుచేయుటకుగాని ప్రతివాదికి ఏలాటిహక్కున్నులేదు. సదరు వాకిలిపూడిపించి సదరువాకిలిగుండా నడవకుండా యుండగలందులకు యీదావా దాఖలు చేయడమైనది.

6. వ్యాజ్యకారణం BC మార్కు గోడలో K మార్కు వాకిలి పెట్టి వాని A మార్కు స్థలములోగుండా ప్రతివాది నడుచుటకు ప్రయత్నిస్తూన్న ఇప్పటికి 8 రోజుల క్రిందట తమ డి॥ యిలాకా యేటు కూరు గ్రామములో కలిగినది.

7. దావా వివరం

| | |
|---|---|
| BC మార్కు గోడలో K మార్కు వాకిలిని పెట్టుటకుగాని సదరు వాకిలిగుండా A మార్కు స్థలములోకి నడచుటకు గాని ప్రతివాదులకు హక్కు లేదని డిక్రీ చేయుటకు పరిహారం కిమ్మతు. | 15_0_0 |
| సదరు వాకిలిపూడ్చుటకు కిమ్మతు. | 5_0_0 |
| సదరు గోడలో వాకిలి పెట్టకుండా నున్న వాకిలినుంచి A మార్కు స్థలములోకి నడవకుండా నున్న పర్మనెంటు ఇన్‌జెక్షను కిమ్మతు. | 5_0_0 |
| | 25_0_0 |

స్టాంపుడ్యూటి రు లకు దాఖలు

8. కాబట్టి వాదితరపు విన్నపించి.

1. దావాప్లానుదాఖలా B, C, మార్కు గోడలో K మార్కు వాకిలి పెట్టుటకుగాని దానిగుండా A మార్కు స్థలములోకి ప్రతివాది నడచుటకుగాని హక్కు లేదని డిక్లేర్ చేయుటకున్ను.

2. K మార్కు వాకిలిపూడ్చివేయించుటకున్ను

3. సదరువాకిలి ద్వారాగాని సదరు గోడలో ఇంకా ఇతరవాకిళ్లుపెట్టి వాటిగుండా గాని A మార్కు స్థలములోకి ప్రతివాది నడవకుండాను వుపయోగించుకొనకుండాను పర్మనెంటు ఇంజెక్షను యిప్పించవలెనన్ని.

4. దావా ఖర్చులున్ను

5. యింకా యీవిషయమై

షరా:—ఈజ్ మెంటు దావాలకు, హక్కుస్థిరపరచు యీదావాలకు, ప్లెయింటు వెంటనే ప్లానుదాఖలు చెయ్యవలయును.

## 9 మహమ్మదీయ పార్టిషన్ దావా.

మ॥ గుంటూరు ప్రిన్సిపల్ డి॥ మునసిఫ్ కోర్టు వారికి

అసలు—/1924

హిమాంబి వాది

మరియు

1 హాసన్‌బి.
2 షేకు పెంటు.
3 షేకు మదారు.
} ప్రతివాదులు

శి॥ ప్రొ॥ శె॥ 26 రు ప్రకారం వాదిదావా

1. వాది వివరం

2. ప్రతివాది వివరం

3. లేటు గాలీబుసాహెబుకు వాది కుమార్తెయున్ను 2, 3 ప్రతివాదులు కుమాళ్ళున్ను 1 ప్రతివాది భార్యయున్ను అయియున్నది.

4. సదరుగాలీబు సాహెబు ఇప్పటికి షుమారు 11 సంవత్సరముల క్రిందట చనిపోయినాడు. సదరు లేటు గాలీబుసాహెబుకు గుంటూరు గ్రామంలో A షెడ్యూలుదాఖలా స్థిరాస్తిన్ని B షెడ్యూలు దాఖలా చరాస్తిన్ని వుండివున్నవి. బాకీలు ఏమియులేవు. కొంతరొఖము మాత్రమువున్నది. దానినివడ్డికి ఇచ్చివృద్ధిచేసినాడు. సదరు ఆస్తిని గాలీబుసాహెబు చనిపోయినది లగాయతు వుభయవాదులు జాయింటుగా అనుభవిస్తు వచ్చినారు.

5. సదరు ఆస్తియందు వాదికి రావలసిన హక్కును పంచిపెట్టి ఇవ్వవలసినదని ఎన్నిపర్యాయములు తగాదాపడ్చినను ఆస్తిని పంచిపెట్టి ఇచ్చివుండలేదు. రిజష్టర్‌నోటీసు ఇవ్వగా పేచీసంగతులతో జవాబు

ఇచ్చినారు. అందువల్ల యీదావా దాఖలుచేయడమైనది.

6. మహమ్మదీయ లాప్రకారం 1 ప్రతివాదికి 1/8 భాగమున్ను 2, 3 ప్రతివాదులకు చెరి 7/20 భాగములున్ను వాదికి 7/40 భాగమున్ను రావలసివున్నవి. సదరు వాదిభాగమును వేఱుచేయించి ఆ స్తిని స్వాధీనంచేయు నిమిత్తం యీదావా వేయడమైనది.

7. వ్యాజ్యకారణం వాదితండ్రియైన లేటు గాలీబుసాహెబు కాలంచేసిన 9_1_12 తేదీనన్ను ప్రతివాదులు వాదితాలూకు ఆభాగమును పంచి ఇచ్చుటకు నిరాకరించిన దరిమిలానున్ను తమ డి॥ యిలాకా గుంటూరు గ్రామములో కలిగినది.

8. దావా వివరం

| | |
|---|---|
| షెడ్యూళ్ళదాఖలా ఆస్తులయందు వాది తాలూకు 7/40 వంతు భాగమును విభాగించి వాదికి స్వాధీనం చేయుటకు దాఖలు చేసినస్టాంపు. | 15_0_0 |

లు దాఖలు చేయడమైనది.

9 కాబట్టి వాదితరపు విమర్శించి

A షెడ్యూలు దాఖలా స్థిరాస్తిలో వాది భాగము 7/40 వంతును పంపిణీచేయించి ఆభాగమును వాదికి స్వాధీనం చేయించమనిన్ని.

2 బి షెడ్యూలు దాఖలా చరాస్తిలో వాది 7/40 వంతు చరాస్తిగాని దానికిమ్మతుగాని వాదికి యిప్పించవలెననిన్ని.

3. దావా ఖర్చులున్ను

4. ఇంకా కోర్టువారికి న్యాయమనితోచే అన్ని ఇతర పరిహారములతో వాదిపక్షం డిక్రి ఇప్పించవలెనని వాది ప్రార్థిస్తూయున్నది.

దస్కతు,

ప్రమాణవచనం.

మకాం గుంటూరు,

తేది

షరా:— షెడ్యూళ్లు దాఖలుచేయవలెను.

# 10 పార్టీషనునిమిత్తం దాఖలుచేసిన దావా.

మ॥ గుంటూరు ప్రి॥ డి॥ మునసిఫ్ కోర్టువారికి

అసలు—/1924

సింగంరాజు కోటేశ్వరరావు  వాది

ఎదిరి

1 సింగంరాజు మాధవయ్య
2 యీ సుబ్బయ్య
3 యీ సూరయ్య
} ప్రతివాదులు

శి॥ ప్రొ॥ శె 26 ప్రకారం వాదిదావా

1. వాదివివరం.

2. ప్రతివాదుల వివరం.

3. వాదికి 1 ప్రతివాదితండ్రిన్ని 2, 3, ప్రతివాదులు సోదర్లున్ను అయివున్నారు.

4. సదరు 1 ప్రతివాదికిభార్యయున్నూ వాదికిన్ని, 2, 3, ప్రతి వాదులకు తల్లిన్ని అయిన రామలక్ష్మమ్మ యిప్పటికి షుమారు 10 సంవత్సరములక్రిందట కాలంజేసినది. 1 ప్రతివాది తిరిగి వివాహము చేసికొన్నాడు. అమె ఇప్పటికి షుమారు 6 సంవత్సరములనాడు కాపురమునకువచ్చి 1 ప్రతివాదితో కాపురముచేయుచున్నది. వాదికిన్ని 2,3, ప్రతివాదులకున్నూ వివాహములయి భార్యలుకాపురమునకువచ్చి ఎవరికాపురము వారు జేసుకుంటూ వుభయవాదులు జాయింటుగా గుంటూరుగ్రామంలో వుంటూవచ్చినారు.

5. వాది భార్యకున్ను 1 ప్రతివాది భార్యకున్ను షుమారు 2 సంవత్సరములనుంచి జొత్తుగా పడక వుంటూ వుండగా 1, 2 ప్రతి వాదులున్ను వారి భార్యలున్ను వాదిని వాది భార్యను చాలా కష్ట పెట్టుతూ, వినరాని దుర్భాషలు ఆడుచూ వున్నారు. ఇట్టి సందర్భ

ములో 1, 2 ప్రతివాదులలో జాయింటుగా వుండుటకు వాదికిమనస్కరింపక, 1 వ వాది ప్రతివాదులను తనభాగమును పంచిపెట్టవలసినదిగా ఎన్నిపర్యాయములు కోరినను పంచిపెట్టక నిరాకరించినారు. అంతట వాది ప్రతివాదులకు రిజష్టరీవుత్తరము ఇచ్చితగాదాపర్చగా నిరాకరణ చేసినారు. అందువల్ల యీదావాదాఖలు చేయడమైనది.

6. వుభయవాదులకు జాయింటున A షెడ్యూలుదాఖలా నంబూరుగ్రామంలో య 40 ల భూమిన్ని తురకపాలెంగ్రామములో య 18 ల భూమిన్ని మంగళగిరిగ్రామంలో య 15 ల భూమిన్ని B షెడ్యూలు దాఖలా ఇత్తడి కొయ్యమొదలగు చరాస్తిన్ని C షెడ్యూలుదాఖలా లోకులవల్ల రావలసిన బాకీలున్నూ D షెడ్యూలు దాఖలా నిల్వరొఖ్ఖమున్నూ వుండివున్నవి. లోకులకు బాకీలు యేమియులేవు.

7. హిందూలాప్రకారం షెడ్యూళ్ళదాఖలా ఆస్తులలో వాదికి 1/4 భాగమున్నూ 1 ప్రతివాదికి 1/4 భాగమున్నూ 2 ప్రతివాదికి 1/4 భాగమున్నూ 3 ప్రతివాదికి 1/4 భాగమున్ను రావలసివున్నది. సదరు భాగములు విభాగముచేయించి ఆస్తిని స్వాధీనపర్చించగలందులకు యీదావా వేయడమైనది.

8. వ్యాజ్యకారణం ప్రతివాదులు వాదితాలూకు భాగమును పంచియిచ్చుటకు నిరాకరించిన దరిమిలా ఇప్పటికి 2 సంవత్సరముల నుంచిన్ని రిజష్టరీవుత్తరం ఇచ్చితగాదాపర్చిన 3_7_23 తేదీనుంచిన్ని తమ డి॥ యిలాకా గుంటూరు, నంబూరు, మంగళగిరి, తురకపాలెం గ్రామములలో కలిగినది.

9. దావావివరం

షెడ్యూళ్లదాఖలా ఆస్తియందు వాదితాలూకు 1/4 వంతు భాగమును విభాగముచేయించి వాదికిస్వాధీనముచేయుటకు ష్టాంపు 15_0_0

దాఖలుచేయడమైనది.

10. కాబట్టి వాదితరఫు విమర్శించి.

1 A షెడ్యూలు దాఖలా స్థిరాస్తిని వుత్తమమధ్యమ కనీసములవెంట 4 సమాన భాగములు చేయించి, వాదికి రావలసిన 1/4 వంతు భాగమును స్వాధీనము చేయుటకున్ను.

2 B షెడ్యూలు దాఖలా చరాస్తిని 4 భాగములుచేసి వాదికి రావలసిన 1/4 వంతు చరాస్తిని ఇప్పించవలెననిన్ని.

3 C షెడ్యూలు దాఖలా లోకులవల్ల రావలసిన బాకీలలో పోబాకీలుకనిపెట్టి 4 సమ్మానభాగములు చేయించి వాదిపంతు 1/4 వంతు బాకీలు ట్రాన్సుఫరు చేయించవలెననిన్ని.

4 నిల్వవున్న రొఖ్ఖములో వాదివంతుకు రావలసిన్న 1/4 వంతు రొఖ్ఖము ఇప్పించవలెననిన్ని

5 దావాఖర్చులున్నూ

6 ఇంకా యీవిషయమై కోర్టువారికి న్యాయమని తోచేలన్ని ఇతర పరిహారములతో వాదిపక్షం డిక్రి ఇప్పించవలెనని వాది ప్రార్థిస్తూయున్నాడు.

వాది దస్కతు

ప్రమాణవచనం

మకాం తేది

షరా:— షెడ్యూళ్ళు దాఖలు చేయవలయును.

# 11 రిజిష్టరీకబోలియ్యతుబట్టిదావా

మ॥ గుంటూరు ప్రిన్సిపల్ సబుజడ్జి కోర్టువారి సముఖమునకు

అసలు—/1924

సూరపరాజు వెంకయ్య వాది

యెదిరి

మానికొండ బ్రహ్మయ్య ప్రతివాది

శి॥ ప్రా॥ శె॥ 26 ప్రకారం వాదిదావా

1. వాది వివరం

2. ప్రతివాది వివరం

3. తమ డి॥ యిలాకా శేకూరుగ్రామంలో వాదికి హక్కుభుక్తములు గల డి॥ నె 20 రు 14_8_0 క్విటురెంటుగల య 14-50 శెంట్ల మాగాని భూమిని ప్రతివాది జిరాయితీ చేసుకొనగోరియ 1 కి ఒకపుట్టి చొప్పున ప్రతిసంవత్సర మాఖ బ ౩౦ లు నాటికి రాయిగడ్డ

లేకుండా గుంటూరుకు స్వంతఖర్చులతో తోలుకునివచ్చి సర్కారు శిఖామానికను య 14-50 లకు 14 పుట్లు పండుము ధాన్యము వొప్పగింత పెట్టేలాగున్నున్ను వాయిదా వెళ్ళిన తేదీ లగాయతు నె 1 కి నూటికి రు 1-0-0 చొప్పున వడ్డీ యిచ్చేలాగున్నున్ను రౌద్రినామసంవత్సర పంటలగాయతు రక్తాక్షినామసంవత్సరపంట ఆఖరువరకు 5 సంవత్సరములకు వాదితావున కవులుపొంది ప్రతివాది యిందుతో జతపర్చినది తేదీగల రిజష్టరీ కబోలియ్యతును వ్రాయించియిచ్చి సదరు తేదీననే భూమిని స్వాధీన పర్చుకున్నాడు.

4. ప్రతివాది సదరు భూమిని స్వాధీనపరుచుకుని రౌద్రిసంవత్సరము లగాయతు జిరాయితిచేసుకుని అనుభవించుచూయున్నాడు.

5. ప్రతివాది రౌద్రినామసంవత్సరమునకు ఇవ్వవలసిన మక్తాధాన్యము వాయిదా తేదీనాటికి గుంటూరు తోలుకునివచ్చి వప్పజెప్పినాడు. దుర్మతి దుందుభి నామసంవత్సరములతాలూకు మక్తాధాన్యము ఇవ్వవలసిన దుర్మతినామసం॥ మాఖ బ 30 లుకుసరియైనది తేదీ గతించినను, దుందుభినామసం॥ మాఖ బ 30 లుకుసరియైనది తేదీ గతించినను, మక్తాధాన్యము వప్పజెప్పియుండలేదు. సదరు మక్తాధాన్యముకు గురించి వాది ప్రతివాదికి, రిజష్టరీవుత్తరము ఇచ్చి తగాదా పర్చినను తోలియుండలేదు.

6. దుర్మతినామసం॥ మాఖ బ 30 లుకు సరియైనది తేదీన ధాన్యమునకు మార్కెటురేటుప్రకారము ధర పుట్టి 1కి రు 100-0-0లున్నూ దుందుభినామసంవత్సర మాఖ బ 30 లకు సరియైనది తేదీన ధాన్యమునకు మార్కెటురేటుప్రకారం ధర పుట్టి 1కి రు 105-0-0 లున్నూవుండివున్నది. సదరురేట్లప్రకారము వాదికిప్రతివాది వాయిదాలు వెళ్ళిన తేదీలులగాయతు నె 1కి నూటికి రు 1-0-0 చొప్పున వడ్డీతో కబోలియ్యతుషరతుప్రకారం ఇచ్చుటకు బద్ధుడయి వున్నాడు.

7. వ్యాజ్యకారణం దావా కబోలియ్యతు వ్రాయించియిచ్చినది తేదీనన్ను దుర్మతినామసం॥ మక్తాధాన్యము తోలవలసిన వాయిదాఅగు దుర్మతి సం॥ మాఖ బ 30 లకు సరియైనది తేదీనన్ను దుందుభినామ సంవత్సరం మక్తాధాన్యం తోలవలసిన వాయిదా

అగు దుందుభినామ సం॥ మాఖ బ 30 లకు సరియైన, ది తేదీన నున్ను తమ డి॥యిలాకా శేకూరు, గుంటూరు గ్రామములలో కలిగినది.

8. దావావివరం.

దుర్మతినామ సం॥ ద॥ మక్తాధాన్యము యివ్వవలసిన వాయిదా అగు దుర్మతి సం॥ మాఖ బ 30 లకు సరియైన ది తేదీన మార్కెటురేటుప్రకారం పుట్టి 1కి రు 100 చొప్పున 14 పుట్ల పందు ముకు అయిన ఖరీదు 1450-0-0

ది to వరకు నె 1కి నూటికి రు 1-0-0 చొప్పున వడ్డీ

దుందుభినామ సం॥ మక్తా ధాన్యము ఇవ్వవలసిన వాయిదాఅగు దుందుభి సం॥ మాఖ బ 30 లకు సరియైన ది తేదీన మార్కెటు రేటుప్రకారం పుట్టి 1కి రు 105 లు చొప్పున 14 పుట్లు పందుముకు అయిన ఖరీదు 1522-8-0

ది to వరకు నె 1కి 100కి రు 1-0-0 చొప్పునవడ్డీ

లకు స్టాంపుడ్యూటీ రు లు దాఖలు

9. కాబట్టి వాదితరఫు విమర్శించి

(a) దావా మొత్తమున్ను (b) దావాఖర్చులున్ను (c) దావా తేదీలగాయతు సొమ్ము ముట్టేవరకు నె 1కి 100కి రు 1-0-0 చొప్పున దరిమిలా వడ్డీతో వాదికి ప్రతివాది యిచ్చుకునే లాగున వాదిపక్షం డిక్రీయిప్పించవలెనని వాది ప్రార్థించుచున్నాడు.

దివ్యచిత్తమునకు తేవలయును.

దస్కతు వాది

ప్రమాణవచనం.

మకాం,
తేదీ.
} దస్కతు వాది.

## 12 కవులుకు ఇచ్చిన భూమి స్వాధీనం నిమిత్తం దావా

మ॥ రా॥ రా॥ శ్రీ గుంటూరు ప్రి॥ డి॥ మున్సిఫ్ కోర్టువారికి,

అసలు నెం /1924

మంత్రిప్రగడ సోమయ్య వాది
ఎదిరి
మాతంగి సుబ్బాయ ప్రతివాది
శి॥ ప్రొ॥ శె 26 ప్రకారం వాదిదావా

1. వాదివివరం.

2. ప్రతివాదివివరం.

3. తమ డి॥ యిలాకా శేకూరుగ్రామంలోని వాదికి హక్కుభుక్తములుగల డి॥ నె 238 రు 0-13-3 లు క్వైట్ రెంటుగల య 9. 86 శెంట్ల మింజుమలె దక్షిణపువైపు య 3. 14 శెంట్లు యీనాం మాగానిభూమిని ప్రతివాది షుమారు నాలుగు సంవత్సరముల నుంచి సం॥ 1కి ఆరుసలకల 10 మానికెలు ధాన్యము యిచ్చేలాగున యేసంవత్సరమునకు ఆసంవత్సరము ఏకసాలుకు వ్రాతమూలకమైన కవులు కబోలియ్యతులక్కో నిమిత్తంలేకుండా మూజివానీగా కవులుపొందుతూ ఆయా సంవత్సరములకు ఇవ్వవలసిన మక్తాధాన్యమును యిస్తూ వచ్చినాడు. సదరుప్రకారం దుందుభినామ సంవత్సరం పంటకూడా అనుభవించినాడు.

4. వాది ప్రతివాదికి సదరు భూమిని విడిచిపెట్టవలసినదని డిశంబరు నోటీసుఇచ్చి తగాదాపర్చినను, దుందుభినామ సంవత్సరమునకు ఇవ్వవలసిన ఏకసాలు మక్తా ఇచ్చి ప్రతివాది భూమిని వారికి స్వాధీనంపర్చియుండలేదు.

5. వాదిభూమిని స్వాధీనము చేసుకోబోగా ప్రతివాది అక్రమముగా వాదికి స్వాధీనము కానివ్వక అడ్డుపర్చి రుధిరోద్గారినామ సంవత్సరముకూడా భూమిని తనస్వాధీనములో వుంచుకొని జిరాయతిచేసి పైరువేసినాడు. అందువల్ల వాదికి చాలా నష్టముకలిగినది.

6. ప్రతివాది అక్రమముగా రుధిరోద్గారినామ సం॥ జిరాయతి చేసుకొని అందలి ఫలితమును అనుభవించి, వాదికి అయివజు చిక్కకుండాచేసి, నష్టపర్చవలయుననే దురుద్దేశ్యముతో వుండియున్నాడు. ప్రతివాది సదరు భూమిని జిరాయతిచేసుకుని అనుభవించుచున్నాడు. గనుక Use and occupation క్రింద Damgaesరూపకముగానయినను

మక్తాధాన్యము ఇచ్చుటకున్నూ ప్రతివాది వాదికి షెడ్యూలు దాఖలా భూమిని స్వాధీనపర్చుటకున్నూ, దావా ఫయిసలు అయ్యేవరకు మధ్య ఫలసాయము ఇచ్చుటకున్నూ బద్ధుడయి వున్నాడు.

7. సదరు భూమియందు వాదికిగల హక్కును స్థిరపరిపించి వాదికి స్వాధీనపరిపించవలసి యున్నది. సదరు భూమిలోని పైరును, ప్రతివాది కోసుకొని మక్తాచెల్లించకుండా చేయవలయునని దురుద్దేశ్యముతో వున్నాడు. గనుక భూమి స్వాధీనంనిమిత్తం యీదావా దాఖలు చేయడమైనది.

8. వ్యాజ్యకారణం దావాభూమిని ప్రతివాది అక్రమముగా స్వాధీనపర్చుకొని పైరువేసుకున్న 1923 సం॥ జూలై నెలలో కలిగినది.

9. దావావివరం.

| | |
|---|---|
| వాదితాలూకు భూమిని ప్రతివాది స్వాధీనమును తప్పించి వాదికి స్వాధీన పరిపించగలందులకు సంవత్సరము మక్తా ధాన్యపు కిమ్మతు | రు 86 రు |

ల మీద స్టాంపుడ్యూటీ రు 10 లు దాఖలు చేయడమైనది.

10. కాబట్టి వాదితరఫు విమర్శించి

౧. దావా భూమిన్నిప్రతివాది స్వాధీనమునుండి తప్పించి వాదికి స్వాధీనపరిపించవలెననిన్ని

౨. దావా ఖర్చులున్నూ

3. దావా ఫయిసలు అయ్యేవరకు మధ్యఫలసాయము సదరు ప్రకారము ఇప్పించవలసినదనిన్ని,

౪. ఇంకా కోర్టువారికి యుక్తమని న్యాయమని తోచే అన్ని ఇతర పరిహారములతో వాదిపక్షం డిక్రీ ఇప్పించవలెనని వాది ప్రార్థించుచున్నాడు.

దివ్యచిత్తమునకు తేవలయును.

దస్కతు వాది

ప్రమాణ వచనం

మకాం దస్కతు వాది

తేదీ

**షరా:— షెడ్యూలు దాఖలు చేయవలయును.**

# 13 ఈజిమెంటుహక్కును స్థిరపరిపించుటకు దావా

మ॥ గుంటూరు ప్రి॥ డి॥ మున్సిఫ్ కోర్టువారికి,

అసలు /1924

1. పసుమర్తి అంకయ్య
2. యీ రామయ్య } వాదులు

ఎదిరి

1. మంచాళ్ళ కోటయ్య
2. యీ సూరయ్య
3. సుబ్రాముని బాపయ్య } ప్రతివాదులు

శి॥ ప్రో॥ శె 26 ప్రకారం వాదిదావా.

1. వాదులవివరం

2. ప్రతివాదులవివరం.

3. తమ డి॥ యిలాకా పాతగుంటూరు గ్రామంలో యిందుతో జతపర్చిన ప్లానుదాఖలా A B మార్కు పొలములో డి నె 682 రు A మార్కుభూమి వాదులదిన్ని B మార్కు భూమి 3 ప్రతివాదిదిన్ని C మార్కుపొలము 2 ప్రతివాదిదిన్ని డి నె 685 రు A గుర్తుడిమార్కు భూమి 1 ప్రతివాదిదిన్ని అయివున్నది. సదరు 682 రు ఏ మార్కు పొలము దక్షిణమునుండి వుత్తరమునకు వాలుగా వుండును.

4. ఎ మార్కు భూమిలోపడే వర్షపునీరు పరుపుగా ప్లానులో కనుపర్చిన విధముగా వుత్తరముకు ప్రవహించి జి మార్కువద్ద తూర్పుగా కొంతనీరు 1 ప్రతివాదిపొలములోకిపోయి అందులోవున్న కె మార్కుకుంటలోనికిపోయి అదినిండినతరువాత కొంతనీరు డి మార్కు పొలములోనుంచి వుత్తరముగానున్న కొంతనీరు బి మార్కుపొలము గుండానున్న సి మార్కుపొలములోనుంచి వుత్తరమునకు పరుపుగాను జాలులవెంబడిన్ని డొంకకుపోయేహక్కు అనాదినుంచి అనగా ఇప్పటికి షుమారు 50 సం॥ లపైకాలమునుంచి గలదు.

5. ఎ. మార్కుపొలమును 3 సంవత్సరములక్రిందట వాసావారి

వద్ద వాదులు 1, 2 ప్రతివాదులు పెట్టినధరకంటె ఎక్కువధరపెట్టి కొన్నారనేకార్పణ్యముచేత వాదులను ఎటులనయినా నష్టము కలుగజేయవలయుననే దురుద్దేశ్యముతో H. I. J. L. మార్కు $1\frac{1}{2}$గజము ఎత్తుగల షుమారు 4 గజముల వెడల్పుగా కట్టను 1. 2. ప్రతివాదులు పోసినారు షుమారు 3మాసములక్రిందట పొలములోపలి భాగముకూడా జాలులకు అడ్డముగా మట్టి మెరకగా పోసినారు. అందువల్ల నీరుప్రవహించుటకు వీలులేక వాదులు ఏ మార్కు పొలములోపడే వర్షపునీరు వుత్తరముకు పోవుటకువీలులేక 3 ప్రతివాదిపొలములో కొంతయున్నవాదులపొలములో కొంతయున్న నిలిచి పైరుపండక భూమిని నష్టము చేయుచుండెను.

6. 1 ప్రతివాదితాలూకుపొలములో అనగా కట్టకున్న, కుంటకున్న మధ్య జాలుగావున్న భాగమును కుంటలోనుంచి మన్నుతీసి యమ్. యన్ మార్కుగల షుమారు 6 గజముల వెడల్పున మెరకపోసి ఆపొలములోనికి వాదులపొలములోనుంచి మామూలుగా పొయ్యేవర్షపునీటికి అడ్డముకలుగజేసినారు. అందువల్ల వాదులతాలూకు పొలముకు ఫలనష్టము కలిగినది.

7. 1. 2 ప్రతివాదులు కట్టలుపోయుచుండగా వాదులు అడ్డపరచినారు. 1, 2 ప్రతివాదులు ఆగక దబాయించి మెరకనుపోసినారు. అప్పట్లో 1 వ వాదికుమారుడు బలమైన ఖాయిలాతో బాధపడుచుండుటచేత, తగినచర్యలను తీసుకొనుటకు వీలులేక కొద్దిరోజులు ఆగి పనిచేయవలయునని వాదులు వుద్దేశ్యముతో వుండగా 1, 2 ప్రతివాదులు కాంపయిన్ అయిఅక్రమముగా గుంటూరు మేజిస్ట్రేటు కోర్టులో వాదులమీద చార్జి పెట్టినారు. దానిని మెజిస్ట్రేటుగారు సాకల్యముగావిచారించి 20_11_23 తేదీన కొట్టివేసినారు.

8. కాబట్టి A మార్కులో పడేవర్షపునీరు వుత్తరముగా పరుపుగానున్న జాలుగానున్న కొంతనీరు B. C మార్కుల పొలములోగుండా వుత్తరపుడొంకలోనికి పొయ్యేటటువంటిన్ని కొంతనీరు G మార్కువద్దనుంచి తూర్పుగా సి. డి మార్కుపొలములోవున్న కె మార్కుకుంటలోనికి పోయి అక్కడనుంచి వుత్తరముగా పోయే

యీజిమెంటుహక్కును స్థిరపరిపించుటకున్ను హెచ్. ఐ. జె. యల్ మార్కులకట్టమెరకను తీసివేయించుటకున్ను డి మార్కుపొలములో యం. యన్. మార్కు మెరకను తీసివేయుటకున్ను ఎప్పటికిన్ని పైవిధముగా పోవునటువంటి నీటిహక్కును అడ్డపరచకుండా శాశ్వత యింజెక్షనుకున్న యీ దావా దాఖలు చేయడమైనది.

9. 3 ప్రతివాదికికూడా నష్టముకలుగుచున్నను ప్రస్తుతంకలిసిరానందున్ను అతనినికూడా పార్టిగా చేర్చడమైనది. నీరు నిలుచుటచేత వాదులకు షుమారు 100_0_0 లు నష్టముకూడా కలిగినది. సదరు నష్టముకు వేరే దావాచేయబడును.

10. వ్యాజ్యకారణం వాదులతాలూకు పొలములో పడేవర్షపు నీరు సి. డి మార్కుల పొలములోగుండా పొయ్యేవాదుల ఈజిమెంటు హక్కును 1, 2 ప్రతివాదులు నిరాకరించి హెచ్. ఐ. జె. యల్ మార్కు యం. యన్ మార్కుల కట్టలను వేసి మెరకలవల్ల వాదులను నష్టపరుచుటకు చేసిన ఇప్పటికి షుమారు 3 మాసములక్రిందట తను డి॥ యిలాకా పాతగుంటూరు గ్రామంలో కలిగినది.

11. దావావివరం

| | |
|---|---|
| వాదులపొలములో పడేవర్షపునీరు వుత్తరముగా బి. సి మార్కులగుండా వుత్తరముకున్న తూర్పు డి మార్కుగుండా పోయే యీజిమెంటు హక్కును స్థిరపరిపించుటకు పరిహారం కిమ్మతు. | 10_0_0 |
| హెచ్. ఐ. జె. యల్, యం. యన్ కట్టలు మెరకలు తీసివేయుటకు కిమ్మతు. | 5_0_0 |
| సదరు నీరు వాదులకు అడ్డుకలుగజేయకుండాను్న హెచ్. ఐ. జె. యల్. గాని యం. యన్ ఇంకాయితరములయిన యేవిధమైనకట్టలు మెరకలు వేయకుండా వుండగలందులకు పర్మనెంటు ఇంజక్షను యిప్పించుటకు కిమ్మతు. | 5_0_0 |
| | 20_0_0 |

లకు స్టాంపు డ్యూటి రు. లు దాఖలు

12. కాబట్టి విమర్శించి.

౧. వాదుల ఎ మార్కు పొలములో పడే వర్షపునీరు వుత్తరముగా బి. సి. మార్కు పొలముగుండా పరుపుగానున్నూ జాలులుగానున్నూ వుత్తరముగా సర్కారు డొంకలోనికిన్ని కొంతనీరు జి మార్కు వద్ద డి. మార్కు పొలములో గుండా కె. మార్కు కుంటలోకిన్ని పోయే యీజిమెంట్ హక్కును స్థిరపరిపించవలెననిన్ని

౨. 1, 2 ప్రతివాదులు వేసిన హెచ్. ఐ. జె. యల్. మార్కు కట్టను యం. యన్. మార్కు మెరకలను తీసివేయించమనిన్ని

3. ఎ మార్కు పొలములో పడే వర్షపునీరును వుత్తరముగానున్నూ తూర్పుగానున్నూ పోకుండా ఎప్పటికిన్ని ప్రతివాదులు ఏలాటి అడ్డు కలుగజేయకుండా పర్మినెంటు ఇంజక్షను ఇప్పించమనిన్ని

౪. ఇంకా కోర్టువారికి యుక్తమని న్యాయమని తోచే అన్ని ఇతర పరిహారములతో వాదులపక్షం డిక్రీ యిప్పించమని వాదులు ప్రార్థించుచున్నారు.

దివ్యచిత్తమునకు తేవలయును.

ప్రమాణ వచనము.

గుంటూరు

తారీఖు

మరా:- ప్లాను దాఖలు చేయవలయును.

## 14 డిజల్యూషన్ ఆఫ్ పార్టిషన్‌కు దావా

(లెఖలను తెల్పించుటకు మాత్రము.)

మ॥ రా॥ శ్రీ॥ గుంటూరు ప్రి॥ డి॥ మునసబు కోర్టువారికి.

అసలు /1924

వంకమామిడి పిచ్చయ్య — వాది

1. శ్రీరాం భూపతి 2. తూములూరి రాంభొట్లు భార్య పున్నమ్మ } ప్రతివాదులు

శి॥ ప్రొ॥ సె॥ 26 రు ప్రకారం వాది దావా.

## ప్లెయింట్లు మతలబులు.



1 వాది వివరం

2 ప్రతివాదుల వివరం

3. వాదిన్ని 1 ప్రతివాదిన్ని ఇంకొక తూములూరి రాంభోట్లున్ను లాభనష్టములు సమాన భాగములుగా పంచుకునే షరతుతో ఇప్పటికి షుమారు 6 సం॥ ల క్రిందట వంకమామిడి పిచ్చయ్య కంపెనీ అనుపేరుతో వ్యాపారమును ప్రారంభించి చేయుచూ వచ్చినారు. వారిలో తూములూరి రాంభోట్లు ఒక సంవత్సరం క్రిందట కాలము చేసినాడు. దానికి పూర్వము 1 సంవత్సరము క్రిందటినుండి పని ఆక్టివ్ గా చేయుట మానుకొన్నారు. ఇట్లు పైకంపెనీ జరుగుచూ యుండగా రయిసుకంపెనీ అను పేరుతో ఒక బ్రాంచీ వ్యాపారమును సాగించి అందుకుగాను వంకమామిడి పిచ్చయ్య కంపెనీవారున్ను వాది స్వంతముగానున్ను రయిసుకంపెనీకి బాకీపెట్టుతూ వచ్చినారు, ఆబాపతుకూడా ప్రతివాదులు ఇవ్వవలసివున్నారు. సదరు రయిసుకంపెనీ లెక్క పుస్తకములు చోరులు అపహరించినారు. ఆసంగతి ప్రతివాదులకుకూడా తెలుసును. సదరు కంపెనీలో లోకులవల్ల రావలసిన ఇవ్వవలసిన బాకీలకున్ను జడతాకూడా తయారుచేసుకుని యున్నారు. ఆబాపతు షుమారు రు 2900 లు వుభయవాదులు వంకమామిడి పిచ్చయ్య కంపెనీకి బాకీకూడా తేలినారు.

4. తూములూరి రాంభోట్లు చనిపోయిన దరిమిలా 1 ప్రతివాదిన్ని రాంభోట్లు భార్య అయిన 2 ప్రతివాదినిన్ని లెక్కలు కట్టుకుని ఎవరు ఎవరికి ఇవ్వవలసిన బాకీలు ఫయిసలు చేయవలసినదని కోరగా 1 ప్రతివాది తాను బీదవాడననిన్నీ ఏదోవిధముగా ఫయిసలు చేస్తాననిన్ని తొందర పడవద్దనిన్నీ చెప్పుతూ వచ్చినాడు. వాది అందుకు హర్షించి కొంతకాలము వూరుకున్నాడు.

5. ఇలావుండగా వాదియొక్క విరోధుల కుట్రవల్ల వాదికే వంకమామిడి పిచ్చయ్య కంపెనీవారు షుమారు రు 2000 లకు పైగా బాకీవుండగా 6-11-23 తేదీన 1 ప్రతివాది తనకే రావలసి వుంటుందనిన్ని లెక్కలు తేల్చుకోవలసినదనిన్ని లేనియెడల దావాచేస్తాననిన్ని

మొదలగు సంగతులతో రిజష్టరీపుత్తరం యిచ్చినాడు. వాది యిదివరకే అనేక పర్యాయములు వచ్చి లెక్కలు చూచుకోమని కోరినప్పటికి రాక ఏదో ఒక మిష పెట్టి కాలయాపన చేయుచూ వుండుటచేతనున్ను రిజష్టరుపుత్తరం ఇచ్చిన దరిమిలానుకూడా చూచుకోనప్పటికి లెక్కలు చూచుకొనకుండా టలాయించుట చేతనున్ను ఇకమీద లాభము లేదని ఎంచి యీ వాదే దాఖలుచేసినాడు.

6. వుభయవాదుల కంపెనీతాలూకు లెక్కలను తేల్పించి ఫరంవారు లోకులకు ఇవ్వవలసిన బాకీలను వాదికి ప్రతివాదులు ఇవ్వవలసిన బాకీలను తేల్పించి వాదికి యివ్వవలసిన బాకీ మొత్తమున్ను తేల్పించుటకున్ను యీదావా దాఖలుచేయడమైనది. రౌద్రి సం॥ నిజ శ్రావణ శు ౧౧ లు వరకు 1 ప్రతివాది తన స్వదస్తూరితో పద్దులను వ్రాసినాడు. దరిమిలా పద్దులను మాత్రము అతను రానందున వాది వ్రాసినాడు.

7. తూములూరు రాంభోట్లు 2 వ ప్రతివాదితో అవిభక్తుడుగా వుంటూ షుమారు 1 సం॥ క్రిందట కాలముచేసినాడు. ఆయన తాలూకు యావదాస్తి వారసత్వేన లా ప్రకారం భార్యఅయిన 3 ప్రతివాదికి సంక్రమించినది. ఇతరం ముఖ్యవారసులు యెవరూ లేరు.

8. వ్యాజ్యకారణం దావాఫరం వ్యాపారం ముగిసిన రెండు సంవత్సరములనుంచిన్ని ఫరంతాలూకు భాగస్తుడయిన తూములూరు రాంభోట్లు చనిపోయిన తేదీ అయిన యిప్పటికి షుమారు 1 సం॥ లగాయతు తమ డి॥ యిలాకా గుంటూరుగ్రామంలో కలిగినది.

9. దావావివరం

లెఖ్ఖలను తేల్పి మటకు వాదివేసిన ప్రస్తుతపు మదింపు రు100

లకు స్టాంపుడ్యూటి రు 11_0_0 లు దాఖలు

కోర్టుఫీజు ఆక్టు శెక్షను 7 వ క్లాజు1 ప్రకారం లెఖ్ఖలను తేల్పించిన తరువాత అయ్యే మొత్తమును స్టాంపుడ్యూటి దాఖలు చేయబడును.

సరిహద్దులు నిమిత్తం రు 100_0_0 లు

10. కాబట్టి వాదితరఫు విమర్శించి.

ఎ. దావాఫరం డిసల్వ్యూషన్ అయినట్టు డిక్రీ చేయించు టకున్నూ.

బి. ఫరంతాలూకు లెఖ్ఖలను తేల్పించి లోకలకు ఫరంవారు ఇవ్వవలసిన బాకీలున్నూ ప్రతివాదులు వాదికి ఇవ్వవలసిన బాకీలున్నూ తేల్పించవలెనన్నిన్ని.

సి. దావాఖర్చులున్ను

డి. ఇంకా యీవిషయమై కోర్టువారికి యుక్తమనితోచే అన్ని ఇతరపరిహారములతో వాది పక్షం డిక్రీ యిప్పించవలెనని వాది ప్రార్థిస్తూయున్నాము.

దివ్యచిత్తమునకు తేవలయును.

ప్రమాణవచనం.

మకాం
తేది. }

## 15 వారసత్వపుహక్కును స్థిరపరిపించి గతఫలసాయమును ఇప్పించమని దావా

మ॥ రా॥ శ్రా॥ శ్రీ గుంటూరు ప్రి॥ డి॥ మున్సిఫ్ కోర్టువారికి,

అసలు /1924

మంత్రాల గోవిందమ్మ వాది

ఎదిరి

1. శ్రీరాజా నరసింగరాజు బహదూర్
2. శీతంపల్లి మల్లయ్య
3. మల్లంపల్లి శీతయ్య
4. మంత్రాల సూరమ్మ

} ప్రతివాదులు

శి॥ ప్రొ॥ శె॥ 26 ప్రకారం వాదిదావా

1. వాదివివరం

2. ప్రతివాదివివరం.

3. తమ డి॥ యిలాకా చలపాడు గ్రామంలో వాదిపూర్వుల వల్ల సంపాదింపబడి చలపాటి శ్రీమల్లేశ్వరస్వామివారి స్వస్తివాజనపు షెడ్యూలుదాఖలా ఈనాం భూమిని వాదిభర్తయున్ను వాదిపూర్వులున్నూ అనుభవిస్తూ స్వామివారి స్వస్తి వాజనము చాలాకాలము నుంచి చేయుచూ వచ్చినారు.

4. వాదిభర్త 4 ప్రతివాదికి దత్తుకుమార్డు అయివున్నాడు. సదరు వాదిభర్త చనిపోయినాడు. చనిపోయిన తరువాత ఆయనయావదాస్తికి వాది హిందూలాప్రకారం వారసు అయివున్నది. ఇట్టిస్తితిలో వాదిని నష్టపర్చవలయుననే దురుద్దేశ్యముతో 4 ప్రతివాది 2 ప్రతివాది పేరటికి పరసనల్ షెడ్యూలు దాఖలా భూమిని 1323 ఫసలీలగాయతు 1327 ఫసలీ ఆఖరువరకు కవులుకు ఇచ్చి కవులుమొత్తమును ఆమెయే అనుభవించినది. వాదికి యెంతమాత్రము చెందియుండలేదు. 1 ప్రతివాది శ్రీస్వామివారి ధర్మకర్త అయివున్నాడు దావాభూమిని వాదిస్వాధీనములోనుంచి తప్పించితాను స్వాధీనముచేసుకొనుటకు యెంతమాత్రము హక్కు అధికారములులేవు. వాదిభర్త చనిపోయిన దరిమిలాను భూమి 4 ప్రతివాది స్వాధీనములో వున్నను వాదితరఫున వాదితండ్రి స్వస్తివాజనము జరుపుచూ వచ్చినారు. 1 ప్రతివాది అక్రమముగా దానికి అడ్డుకలుగజేసి తానులాభము పొందవలయుననే దురుద్దేశ్యముతో ,భూమిని హరించినాడు. స్వస్తివాజనము చెప్పించుటకు వాది సిద్ధముగా వున్నది. 1 ప్రతివాది ఆపుటకు హక్కులేదు.

5. అదియునుంగాక 4 ప్రతివాదిన్ని యితర ప్రతివాదులున్నూ యేకమయి యీవాదిని నష్టపర్చవలయుననే దురుద్దేశ్యముతో దావా భూమిని 1 ప్రతివాది 4 ప్రతివాదిని లోబర్చుకుని, స్వాధీనపర్చుకుని 2, 3 ప్రతివాదులకు కవులుఇచ్చి వాదియొక్క స్వాధీనమును తప్పించియున్నాడు. సం 1 కి రు 30_0_0 లు చొప్పున కవులుకుయిచ్చినారు. వాదిమయినరు అయి స్త్రీఅగుటవల్లనున్ను వంట్లోసుస్తీగావుండుటచేతనున్ను స్వాధీనమునకున్ను మక్తాకున్నూ దావావేయుటకు వీలులేక

పోయినది. లా ప్రకారం 1 ప్రతివాది దావాభూమిని స్వాధీనపర్చుకుని అనుభవించుటకు హక్కు అధికారములు లేవు. గనుక భూమిస్వాధీనమునకున్ను 1328 వ ఫసలీలగాయతు 1331 ఫసలీఆఖరువరకు గతఫలసాయమునకున్ను మధ్యఫలసాయమునకున్ను యీదావా దాఖలుచేయడమయినది. 2, 3 ప్రతివాదులు 1 ప్రతివాదివలన లాలూచీగా ఆయనవద్ద కవులుకు పుచ్చుకుని ఆయనకే మక్తా యిస్తూవున్నందున 2, 3 ప్రతివాదులున్ను 4 ప్రతివాది లాలూచీ అయినందున ఆమెనున్ను పార్టీలుగా చేర్చడమయినది. సదరు ప్రకారం 1328 ఫసలి లగాయతు 1331 ఫసలీవరకు గతఫలసాయమున్ను సదరు ప్రకారం మధ్యఫలసాయమున్ను వాదికి రావలసి యున్నది.

6. వాది తనకుగాను యితరులచేత స్వస్తివాజనము చెప్పించుటకు లా ప్రకారంహక్కుగలదు. సదరుహక్కును 1 ప్రతివాది నిరోధించి స్వస్తివాజనము చెప్పకుండా చేయుటకు వీలులేదుగనుక సదరుహక్కు స్థిరపరిపించుటకు యీదావా దాఖలుచేయడమయినది. యింకా సదరు హక్కుతో 1 ప్రతివాది ఇన్‌టర్‌ఫియర్‌గాకుండా పర్మనెంటు ఇన్‌జక్షను కూడా దాఖలుచేయడమయినది.

7. వ్యాజ్యకారణం దావాభూమిని 1 ప్రతివాది ఇతరప్రతివాదులతో లాలూచీఅయి భూమిని అక్రమముగా స్వాధీనపరచుకున్న 5, 6 సంవత్సరముల క్రిందటనున్ను వాదికి మయినారిటీ వెళ్ళిన ఇప్పటికి 2 సంవత్సరముల క్రిందటనున్ను తమ డి॥ యిలాకా చలపాడు గ్రామంలో కలిగినది.

8. దావావివరం.

| | |
|---|---|
| దావాభూమికి శిస్తు రు. 30 లకు 15 రెట్లు | రు. 450-0-0 |
| 1328 ఫసలీలగాయతు 1331 ఫసలీవరకు నె 1కి రు. 30 లు చొప్పున గతఫలసాయం | రు. 90-0-0 |
| స్వస్తివాజనపుహక్కును స్థిరపరిపించుటకు వాదిమదింపు | రు. 5-0-0 |

సదరు హక్కులో 1 ప్రతివాది యిన్టర్ ఫియర్ కాకుండా
పర్మనెంటు ఇంజక్షనునిమిత్తం రు. 5-0-0

రు. 550-0-0

లకు స్టాంపుడ్యూటీ రు 61-13-0 లు దాఖలు.

9. కాబట్టి వాదితరఫువిమర్శించి

౧. దావాభూమిని వాదికి ప్రతివాదులవలన స్వాధీనపరిపించ వలెనన్ని,

౨. 3సంవత్సరములగతమక్తా వాదికి 1 to3 ప్రతివాదుల వలన యిప్పించవలెనన్ని,

3. సదరుప్రకారం మధ్యఫలసాయము యిప్పించవలెనన్ని,

౪. స్వస్తివాజినవుహక్కును స్థిరపరిపించి సదరు హక్కులో 1 ప్రతివాది యిన్టర్ఫియర్ కాకుండా పర్మనెంటు ఇంజిక్షన్ను చేయించవలెనన్ని,

౫. దావాఖర్చులున్ను,

౬. ఇంకా యీవిషయమై కోర్టువారికి యుక్తమని న్యాయ మని తోచే అన్నియితరపరిహారములతో వాదిపక్షం డిక్రి యిప్పించ వలెనని వాదిప్రార్థించుచున్నాడు.

దివ్యచిత్తమునకు తేవలయును.

దస్కతు వాది

ప్రమాణవచనం.

మకాం }
తేదీ. }

**మరా:—** షెడ్యూలు దాఖలుచేయవలయును.

## 16 రిశీవరుకు వెస్టుఅయిన ఖాతానుబట్టి దావా

మ॥ రా॥ రా॥ శ్రీ గుంటూరు పి్రి॥ డి॥ మునసబుకోర్టువారికి.

అసలు/ 1924

స్పెషల్ రిశీవరు—యం. సుబ్బారావు వాది.

ఎదిరి,

వణుకూరి మంగయ్య చనిపోయినందున ముఖ్యవారసు అవిభక్తకుమా రుడు వణుకూరి రామన్న ప్రితివాది.

శి॥ ప్రొ॥ శె 26 ప్రకారం వాదిదావా.

1. వాదివివరం.

2. ప్రితివాదివివరం.

3. తమ డి॥ యిలాకాగుంటూరుగ్రామంలో పరుచూరి వెంకయ్య వగయిరాలుతాలూకు జిన్ అండు రయిసు ఫ్యాక్టరీలో ప్రతివాది అవి భక్తతండ్రిఅయిన లేటు మంగయ్య రౌద్రి సం॥ మాఖ బ ౧౨ లకు సరియైన ది తేదీ లగాయతు ఖాతాయుంచి 23_1_21 తేదీ ఆఖ రువరకు బియ్యం ప్రిత్తిగింజలు వగయిరాలు వాడుకొనడము మూల ముగా ఖాతాజరుపుమని ది 23-1-21 తేదీన వెరశికట్లు కట్టుకొని పరు చూరి వెంకయ్య వగయిరాలతాలూకు ముఫజ్జుబాక్కులో సంతకం చేసినాడు.

4. సదరు ఖాతాబాపతు ఇందుతో జతపరిచిన లెక్క ప్రకారం వడ్డీసహా సదరు పరుచూరు వెంకయ్య వగయిరాలకు లేటు మంగయ్య రు. 450 లు బాకీదేలినాడు.

5. లేటుమంగయ్య యీప్రితివాదితో అవిభక్తుడుగావుంటూ షుమారు $1\frac{1}{2}$ సంవత్సరముక్రింద కాలంచేసినాడు. ఆయన తాలూకు యావదాస్తి రయిటాఫ్ సర్వయివర్షిప్‌ద్వారా యీప్రితివాదికి సంక్ర మించినది. ఇంతకంటె ముఖ్యవారసులు యెవరూలేరు.

6. సదరు పరుచూరు వెంకయ్య వగయిరాలు ఇటీవల ఇన్‌సాల్ వెంటుఅయి గుంటూరు డిస్ట్రిక్టుకోర్టులో ఇన్‌సా[illegible]ంటుపిటీషనుదాఖలు చేసినారు. సదరు పిటీషను 10-6-23 తేదీ[illegible]జుడికేట్ అయినది.





సదరు ఇన్సాల్వెంటుపిటీషనులో యీప్రతివాది తండ్రి యివ్వవలసిన బాకీకూడా కనుపరచియున్నారు. కోర్టువారు సదరు పిటీషనులో ఈవాదిని స్పెషల్ రిశీవరుగా అప్పాయింటు చేసినారు. ఈ బాకీ యావన్మంది క్రెడిటర్లకు చెందవలసియున్నది. గనుకనున్ను సదరు బాకీలు యావత్తు యీవాదికి వెస్టు అయినవి గనుకనున్ను యీవాది దావా వేసి సొమ్ము రాబట్టుకొనుటకు హక్కుగలిగినది.

7. సదరు బాకీనిగురించి వాది ప్రతివాదిని తగాదాపరిచినను చెల్లు యేమి యిచ్చియుండలేదు.

8. సదరుఖాతాను వర్తకాచారప్రకారమున్ను ఖరారుప్రకారమున్ను నె 1కి నూటికి రు. 1-0-0 చొప్పున వడ్డీని ఇచ్చుటకు బద్ధుడయి వున్నాడు.

9. వ్యాజ్యకారణం దావా ఖాతాప్రారంభించిన రోది సం॥ మాఖ బ ౧౨ లకు సరియయిన ది తేదీలగాయతు యీసరికి 3 సంవత్సరములలోగా యుండే ప్రతిఖర్చుపడ్డ తేదీననున్ను ప్రతివాది తండ్రి లేటు వణుకూరు మంగయ్య వెరశి కట్టుకట్టుకొని పుస్తకములో సంతకముచేసిన ది 23-1-21 తేదీననున్ను తమ డి॥ యిలాకా గుంటూరు గ్రామములో కలిగినది.

10. దావావివరం.

లెక్కప్రకారం బాకీ రు. 450-0-0 లు

లకు స్టాంపుడ్యూటీ రు. లు దాఖలు.

11. కాబట్టి వాదితరఫు విమర్శించి

ఏ. దావా మొత్తమున్ను, బి. ఖావాఖర్చులున్ను, సి. దావా తేదిలగాయతు సొమ్ముముట్టేవరకు నె 1కి నూటికి రు. 1-0-0 చొప్పున దరిమిలా వడ్డీతో వాదికి లేటు వణుకూరు మంగయ్య ఆస్తివల్ల ఇచ్చుకునేలాగున వాదిపక్షం డిక్రీయిప్పించవలెనని వాది ప్రార్థించుచున్నాడు.

దివ్యచిత్తమునకు తేవలయును.

ప్రమాణవచనం.

మకాం

తేదీ

## 17 డిక్లరేషన్ దావా.

మ॥ రా॥ శ్రీ॥ గుంటూరు ప్రి॥ డి॥ మునసబు కోర్టువారికి.

అసలు /1924

| | | |
|---|---|---|
| పాములపాటి సుబ్బయ్యా మయినరు అయినందున తల్లి (నెక్స్టుఫ్రెండు) కోటమ్మ | } | వాది |
| 1 సీలం మాచమ్మ 2 సంగాపు రామయ్యా 3 మాదిరాజు భీమయ్య | } | ప్రతివాదులు |

శి॥ ప్రొ॥ శె॥ 26 రు ప్రకారం వాదిదావా

1. వాది వివరం.

2. ప్రతివాదుల వివరం.

3. తమ డి॥ యిలాకా తాడికొండ బండారుపల్లి చింతలచెర్వు గ్రామములలోని షెడ్యూలు దాఖలా దావా ఆస్తి లేటు సీలం సోమయ్యగారికి హక్కుభుక్తములు కలిగినది అయ్యుండినను సదరు సోమయ్యకు వాది మేనల్లుడున్ను 1 ప్రతివాదిన్ని 2, 3, ప్రతివాదులు బావమరుదులున్ను అయివున్నారు అనగా 1 ప్రతివాదికి లేటు సోమయ్యా కుమారుడున్ను వాది తల్లియు 2, 3 ప్రతివాదుల భార్యలున్ను కుమార్తెలు అయివున్నారు.

4. మైనరు వాది మేనమామయు దావా ఆస్తికి హక్కుదారుడు అయిన సదరు సోమయ్యగారు పుత్రపుత్రికా సంతానము లేకుండా 13-5-19 తారీఖున గుంటూరు గ్రామంలో కాలంచేసినాడు. దావా ఆస్తియందు తన అనంతరం వాదికి దానాదమన విక్రయార్హతగా సంపూర్ణాధికారముతో సదరు సోమయ్యా తన స్వదస్తూరితో ఇందుతో దాఖలుచేసిన 4-12-18 తేదీగల విల్‌ను వ్రాసినాడు. సదరు విల్ సంగతి 1 మొదలు 3 ప్రతివాదులకున్ను ఇంకా బంధువులు వగయిరాలకున్ను తెలిసియున్నది.

5. సదరు సోమయ్యా కాలముచేసినది లగాయతు దావా ఆస్తి అంతయు వాదికే హక్కుకలిగి వాది క్రిందనే భుక్తమగుచున్నది. దావా ఆస్తిఅంతయు వాదికే హక్కు గలిగి వాదిక్రిందనే భుక్తమగు

చున్నది. దావా ఆస్తి ఇప్పటివరకు వాది స్వాధీనానుభవములోనే వుండివున్నది.

6. ఇట్లుండగా దావాఆస్తి వాదికి హక్కుగా చెందడము ఇష్టము లేక 2. 3 ప్రతివాదుల కుట్రవలన లేటు సోమయ్య భార్య సీతమ్మ యున్ను తల్లి అయిన 1 ప్రతివాదిన్ని ఏకమయి దావాఆస్తిఅంతయు సదరు పున్నమ్మకున్ను 1 ప్రతివాదికిన్ని హక్కుగా చెందేలాగు సదరు సోమయ్య చనిపోయిన 13-5-19 తేదీన ఒక విల్ వ్రాయించినట్లున్ను సదరు విల్ 2 ప్రతివాదివద్ద నిల్వవుంచబడినట్లున్ను మొదలగు సంగతులు కల్పనచేసి ఒక దావాను బనాయించినట్టున్ను సదరు దావాలో ప్రతివాదులు కొంత లాలూచీ గ్రంధమును జరుపుచున్నట్లున్ను మైనరు వాది నెక్ట్సు ఫ్రెండుకు తెలసిన వెంటనే మైనరువాదినిగూడా సదరు దావాతో సప్లిమెంటల్ డిఫెండెంటుగా చేర్పించవలసినదిగా గుంటూరు అ॥ డి॥ కోర్టులో అప్పటిలో పెండింగులో వున్న అసలు 426/19 రు దావాలో స్మాలు 480/19 రున ఒక పిటీషను దాఖలుచేయబడి నంతలో యీవాది సదరు దావాలో అవసరమయిన పార్టీ గాడనే కారణము మీాద సదరు పిటీషను క్రోసివేయబడినది. సదరు దావాలో ఒక లాలూచీరాజీనామా డిక్రీ చేయించుకోబడినట్లు దరిమిలా తెలిసినది. ప్రతివాదులు వగయిరాలు జరిగించిన లాలూచీచర్యలవలన దావాఆస్తి యందు వాదికి వుండే హక్కుభుక్తములకు ఏవిధమయిన భంగము కలుగనందున వెంటనే మయినరువాదితరఫున ఏవిధమయినవ్యవహారము జరుపవలసిన అవుసరము లేకపోయినది.

7. సదరు లాలూచీ చర్యలతో తృప్తిచెందక ఏదోమోసవిధము గాను యుక్తిగాను క్రమప్రకారముగా కొంత ఆస్తిని వాదియొక్క స్వాధీనము తప్పించి తాము హరించవలయుననే దురుద్దేశ్యముతో 2, 3 ప్రతివాదులకున్నూ వాది నెక్ట్సుఫ్రెండుకున్ను యిటీవల కలిగిన మనస్పర్థలవలనను 2 ప్రతివాదికి 1 ప్రతివాది కొంతబాకీ వున్నట్టుగా కల్పనజేసి సదరు బాకీకి 2 ప్రతివాది 1 ప్రతివాదిమీాద గుంటూరుసబు కోర్టులో స్మాలు 126/22 రున డిక్రీని పొందినట్టున్ను సదరు డిక్రీని

బట్టి వాదితాలూకు షెడ్యూలుదాఖలా 5, 6 అయిటముల ఆ స్తిమీద ప్రస్తుతం అమలు జరుపుచున్నట్టు వాదినెక్స్టుఫ్రెండుకు తెలియవచ్చినది.

8. 2 ప్రతివాదికి 1 ప్రతివాది నిజముగా ఇవ్వవలసిన బాకీ ఏమిన్ని లేదు. 2 ప్రతివాదికి లేటు సోమయ్యగారు ఇవ్వవలసిన కొద్ది బాకీ ఆయన జీవించియుండగానే తీర్చబడినది. దరిమిలా 2 ప్రతివాది లేటు సోమయ్యగారి కొరకు ఇచ్చిన సొమ్ము ఏమిన్ని లేదు. సదరు స్మాల్ 126/22 డిక్రీ కేవలము లాలూచీదిన్ని దగామోసముతో గూడినదిన్ని అయివున్నది. దావా ఆ స్తియందు వాదికి హక్కు కలుగజేయు బాకీలు సోమయ్యగారు స్వదస్తూరిన వ్రాసిన దావా విల్ సంగతి 2 ప్రతివాదికి స్పష్టముగా తెలిసియున్నది. సదరు విల్‌నుగురించి పైన వుదహరించిన అసలు 426/19 రు దావాలో 2 ప్రతివాది తాను దాఖలుచేసినస్టేటు మెంటులో స్పష్టముగా వొప్పుకొని యున్నాడు.

9. ఇట్టిసందర్భములో వాది మైనరున్నూ వాది నెక్స్టుఫ్రెండు వ్యవహార మెరుగని ఆడదిన్ని అయిన అవకాశము చూచుకొనిన్ని 1 ప్రతివాదిని మాయమాటలతో లోబరుచుకొనిన్ని ప్రయివేటువగయిరా పనులుచేసే మంచివ్యవహర్తఅయిన 3 ప్రతివాదియొక్క సలహా సహాయము పొందిన్ని సబుకోర్టు ఫైల్ స్మాలు 126/22 రు డిక్రీని బట్టితమకోర్టులో 2 ప్రతివాది జరుపుచున్న అమలు చర్యలు అన్నియు కేవలము దగా దురుద్దేశ్యములతో గూడినవి అయి వున్నవి. అవి లాప్రకారముగాని న్యాయప్రకారముగాని చెల్లతగి నవికావు. 2 ప్రతివాది జరిపే ఇట్టి దగాచర్యలు కొనసాగేయెడల ఉత్తరోత్తరా వాదికి చాలానష్టముకల్గుటకు కారణములగును. పయి 6 వ పేరాలో చెప్పబడిన రాజీనామా డిక్రిన్ని వాదినిబాధించజాలదు. వాది హక్కుకు వ్యతిరేకముగా దావాఆస్తియందు సదరు రాజీనామా డిక్రీ ప్రకారము 1 ప్రతివాదికి ఏవిధమయిన హక్కున్ను కలుగనేరదు. వాదికి హక్కులేదని వాదముచేయుటకు ప్రతివాదులు యెస్టాప్‌న్ను కాబడుచున్నారు.

10. వ్యాజ్యకారణము పైపేరాలలో చెప్పబడిన ప్రకారము దావా ఆస్తియందు వాదికివుండే హక్కుకు భంగకారిగా ప్రతివాదులు

జరుపుచున్న అక్రిమపుచర్యలు వాదికి తెలియవచ్చిన షుమారు 3 రోజులలోగా తమ డి॥ యిలాకా దావా ఆస్తివున్న తాడికొండవగయిరా గ్రామములలో కలిగినది.

11. దావావివరం

వాదికోరే డిక్లరేషన్‌కు రు 15_0_0 లు కోర్టుఫీజుస్టాంపుదాఖలుచేయబడినది.

దావా జూరిస్‌డిక్షను నిమిత్తం ఎ. బి. సి. షెడ్యూళ్ళదాఖలా ఆస్తి రు 820_0_0 లు అయివున్నది.

12. కాబట్టి వాదితరపు విమర్శించి

1. లేటు సోమయ్యగారు స్వదస్తూరిన వ్రాయించిన ది 4-12-18 తేదీగల విల్‌పత్రికరము దావా ఆస్తి యీవాదికి హక్కుగలిగివున్నట్టున్ను సదరు ఆస్తియందు ప్రతివాదులకు ఏవిధముయిన హక్కులేనందున 2 ప్రతివాది 1 ప్రతివాది మీాదపొందిన గుంటూరు సబ్‌కోర్టుపైలుస్మాలు 126/22 రు డిక్రిని బట్టి దావాఆస్తిమీాద అమలు జరుపుటకు వీలులేనట్టున్ను డిక్లేరుచేయుటకున్ను.

2. దావాఖర్చులు కంటెస్టుచేయు ప్రతివాదులు యిచ్చుకునేలాగుననున్ను.

3. ఇంకా యీావిషయమై కోర్టువారికి యుక్తమని న్యాయమని తోచే అన్ని ఇతరపరిహారములతో వాదిపక్షం డిక్రిఇప్పించవలెనని వాది ప్రార్థిస్తూయున్నాడు.

వాది దస్కతు

షరా:— షెడ్యూళ్ళు దాఖలుచేయవలెను.

## 18 క్లయిం పిటీషన్‌మీద చేసిన దావా.

మహారాజశ్రీ గుంటూరు ప్రి॥ డి॥ మునసబు కోర్టువారికి.

అసలు /1924

మల్లంపల్లి వెంకటపతి వాది

మెదిరి

1 సూరవరాజు లింగయ్య 2 యీాదుపుల హనుమయ్య- ప్రతివాదులు

శి॥ ప్రా॥ శె॥ 26 ను ప్రకారం వాది దావా.

1. వాది వివరం.

2. ప్రతివాదుల వివరం.

3. తమ డి॥ యిలాకా గుంటూరు గ్రామంలో తమ కోర్టు ఫయిలు అసలు 320/20 రున 2 ప్రతివాది 1 ప్రతివాదిమీద సింపుల్ మనిడిక్రీని పొంది అందు ననుసరించి అసలు 320/20 స్మాలు 170/23 రును వారంటు అమలు జరిపి షెడ్యూలు దాఖలా భూములలోని మొక్కజొన్న పైరును 18-3-23 తేదీన జప్తుచేయించినాడు.

4. షెడ్యూలుదాఖలా భూమిన్ని యింకా యితరభూమిన్ని 1 ప్రతివాదితావున యీవాది దుందుభినామ సంవత్సరముకు కవులుకు పుచ్చుకొని భూమిని స్వాధీనపరుచుకుని అందులో అనగా షెడ్యూలు దాఖలా భూమిలోనున్ను యితరభూమిలోనున్ను మొక్కజొన్న పయిరు వేసినాడు.

5. సదరుకవులు మధ్యకాలములో 1 ప్రతివాది కవులుమొత్తం కోరినంతలో వాది యిచ్చినందున కవులుమొత్తం యావత్తు పుచ్చుకుని 1, 2 ప్రతివాదులు ఏకమయి వాదిని నష్టపరచవలయుననే దురుద్దేశ్యముతో షెడ్యూలుదాఖలా భూమిలోనివాదికిహక్కుగల మొక్కజొన్న పయిరును పయివిధముగా 2 ప్రతివాది జప్తుచేయించినాడు.

6. 2ప్రతివాది చేయించినజప్తుచెల్లదని ఈవాదితమ కోర్టుఫయిలు అసలు 320/20 స్మాలు 170/23 రులోని జప్తుకు లైబిల్ కాదనియు సదరుక్లయింలోనుంచితొలిగించుటకు ఈదావా దాఖలుచేయడమైనది.

7. జప్తుకాబడిన దావాషెడ్యూలుదాఖలా భూమిలోని మొక్కజొన్నపయిరు రు. 100 లు కిమ్మతుకలిగి యున్నప్పటికి 1,2 ప్రతివాదులు షరీకులయి రు. 50 లు కిమ్మతు వేయించి తమకు బంధువున్ను సలహాదారుడున్ను కుమ్మక్కుదారుడున్ను 2 ప్రతివాదితో వ్యాపారస్తుడున్ను అయిన మంగినపూడి వెంకట్రామయ్యను జామీనుదారుగా

ఏర్పరచి ఆయనకు దావాభూమిలోని పయిరును స్వాధీనపరచగా సదరు జామీనుదారున్ను 2 ప్రతివాదిన్ని అక్రిమపులాభము పొందవలయు ననే దురుద్దేశ్యముతో కోర్టువారి వుత్తరువు లేనిదే అనుభవపరుచుకొని యున్నారు. అందునుగురించి అవుసరమయ్యే పరిహారములు యీ దావా అనంతరం వాదిమీద కోరబడును. యీపయిరు కోయబడిన సంగతి యీవాది లోగడ మిమోద్వారా కోర్టువారికి తెలియపరిచి యున్నాడు.

8. వ్యాజ్యకారణం తమ డి॥ యిలాకా గుంటూరుగ్రామములో కోర్టువారు క్లయిం డిస్మిస్‌చేస్తూ వుత్తరువు దయచేయించిన ది 6-9-23 తేదీన కలిగినది.

9. దావావివరం.

కోర్టువారు క్లయం డిస్మిస్‌చేసిన ది 6_9_23 తేదీ గల వుత్తరువును రద్దుపరిపించగలందులకుస్టాంపు రు. 15_0_0 లు

జ్యూరిస్‌డిక్షనునిమిత్తం దావా కిమ్మతు రు. 100_0_0 లు

10. కాబట్టి కోర్టువారు విమర్శించి

ఎ. షెడ్యూలుదాఖలాఆస్తిలోని లోగడమొక్కజొన్నపయిరు అసలు 320/20 స్మాలు 170/23 రు యెటాచ్‌మెంటు లైబిల్ కాదని స్థిరపరి పించుచు సదరు ఆస్తినిగురించి యెటాచ్‌మెంటురిలీజు చేయించుటకున్ను

బి. దావా ఖర్చులున్ను,

సి. యింకా యీవిషయమై కోర్టువారికి యుక్తమని న్యాయమనితోచే అన్ని ఇతర పరిహారములతో వాదిపక్షం డిక్రీ యిప్పించమని వాది ప్రార్థించుచున్నాడు.

దివ్యచిత్తమునకు తేవలయును.

ప్రమాణవచనం

వరా:— షెడ్యూలు దాఖలుచేయవలయును.

# 19 ఆర్డరు వేసిన ప్రోనోటును బట్టి దావా

మహారాజశ్రీ గుంటూరు ప్రి॥ డి॥ మునసబుకోర్టువారికి.

అసలు /1924

చిగురుపాటి భూపతి—వాది

ఎదిరి

తక్కెళ్ళపాటి నారయ్య—ప్రతివాది

శి॥ ప్రొ॥ శె 26 ప్రకారం వాదిదావా.

1. వాదివివరం.

2. ప్రతివాదివివరం.

3. I. తమ డి॥ఇలాకా తక్కెళ్ళపాడుగ్రామములో రు. 1000 లు మొత్తముకు నె 1కి 100కి రు. 1 చొప్పున వడ్డీతో అయ్యే అసలుఫాయిదాలు అడిగినప్పుడు వాడ్రేవు లింగయ్యగారికిగాని ఆయనఆర్డరుకుగాని ఇచ్చేలాగున సదరు వాడ్రేవు లింగయ్యగారి పేరటికి ప్రతివాది యిందుతో జతపరిచిన ది 10_10_22 తేదీగల ప్రామిశరీనోటును వ్రాయించి యిచ్చినాడు.

II. సదరుప్రామిశరీనోటుతాలూకు అసలు ఫాయిదాలు యీవాదిగాని యీవాది ఆర్డరుగాని రాబట్టుకొనుటకు యీవాది పేరటికి సదరు వాడ్రేవులింగయ్య దావాప్రాంశరీనోటును సరియయిన ప్రతిఫలముకు ట్రాన్సుఫరుచేసి నోటుమీద ది 12_12_22 తేదీన యిండార్సు చేసి యిచ్చినాడు.

III. సదరు ట్రాన్సుఫరుసంగతి వాది ప్రతివాదికి తెలియపరిచి సదరు బాకీనిగురించి తగాదాపరిచినను చెల్లు యివ్వలేదు.

IV. వ్యాజ్యకారణం దావా ప్రోనోటు పుట్టిన ది 10-10-22 తేదీన తమ డి॥ యిలాకా తక్కెళ్ళపాడుగ్రామంలో కలిగినది.

4. దావావివరం.

నోటు అసలు రు. 1000_0_0 లు

10_10_22 మొదలు 10_10_23 వరకు

నె 1కి 100కి రు. 1_0_0 చొప్పున వడ్డీ    రు. 120_0_0 లు

1120_0_0

లకు స్టాంపుడ్యూటీ రు.        దాఖలు

5. కాబట్టి వాదితరఫు విమర్శించి

ఏ. దావా మొత్తమున్ను, బి. దావా ఖర్చులున్ను, సి. దావా తేదీలగాయతు సొమ్ముముట్టేవరకు నె 1కి 100కి రు. 1_0_0 చొప్పున దరిమలా వడ్డితో వాదికి ప్రతివాది యిచ్చుకునేనాగున వాదిపక్షం డిక్రీ ఇప్పించవలెనని వాది ప్రార్థించుచున్నాడు.

దివ్యచిత్తమునకు తేవలయును.

## 20 ప్రోనోటునుబట్టి దావా.

మహారాజశ్రీ గుంటూరు డి॥ మునసబుకోర్టువారికి.

అసలు    /1924

పమిడి గంగారాం—— వాది

ఎదిరి

వలస సీతారాం——ప్రతివాది

శి॥ ప్రొ॥ శె 26 ప్రకారం వాదిదావా

1. వాదివివరం.

2. ప్రతివాదివివరం.

3. I. తమ డి॥ యిలాకా గుంటూరుగ్రామములో రు. 900 లు మొత్తముకు నె 1కి 100కి రు. 1_0_0 చొప్పున వడ్డీతో అయ్యే అసలు ఫాయిదాలు అడిగినప్పుడు వాదికిగాని వాదిఆర్డరుకు గాని ఇచ్చేలాగున వాదిపేరటికి ప్రతివాది ది 14-8-22 తేదిగల ప్రాంశరీనోటును వ్రాయించి యిచ్చినాడు.

II సదరు బాకీని గురించి వాది ప్రతివాదికి రిజష్టరీ పుత్తరం యిచ్చి తగాదాపరిచినను చెల్లుయివ్వలేదు.

III. వ్యాజ్యకారణం దావానోటుపుట్టిన ది 14_7_22 తేదీన

తమ డి॥ యిలాకా గుంటూరుగ్రామంలో కలిగినది.

4. దావావివరం.

నోటు అసలు రు. 900_0_0 లు

14_8_22 మొదలు 14_8_23 వరకు నె 1కి

రు. 100కి రు. 1_0_0 చొప్పున వడ్డి రు. 108_0_0

1008_0_0

లకు స్టాంపుడ్యూటీ రు. లు దాఖలు.

5. కాబట్టి వాదితరపు విమర్శించి

ఎ. దావామొత్తముచ్ను, బి. దావాఖర్చులున్ను, సి. దావా తేదీలగాయతు సొమ్ముముట్టునంతవరకు నె 1కి నూటికి రు. 1 చొప్పున దరిమిలా వడ్డితో వాదికి ప్రతివాది యిచ్చుకునేలాగున వాదిపక్షం డిక్రీ యిప్పించవలెనని వాది ప్రార్థించుచున్నాడు.

దివ్యచిత్తమునకు శేవలయును.

## 21 జట్టిని బట్టి దావా.

గుంటూరు ప్రి॥ డి॥ మునసఫ్ కోర్టువారికి

అసలు /1924

మూరేపల్లి మంగయ్య అండుకంపెని వాది

సీతంరాజు రామిరెడ్డి ప్రతివాది

శి॥ ప్రో॥ శె॥ 26 ప్రకారం వాదిదావా

1. వాదివివరం

2. ప్రతివాదివివరం

3. 1 తమ డి॥ యిలాకా గుంటూరుగ్రామంలో వాది కంపెనీ పేరటికి దుందుభినామ సం॥ మాఖ బ 3ం లకు సరియైన ది తేదీకి పుట్టి 1 కి రు 80_0_0 లు చొప్పున 40 పుట్ల ప్రత్తిని స్వంత ఖర్చులతో గుంటూరుగ్రామములో వాదికంపెనీ తావుకు తోలి వాది కంపెనీవారికి వప్పగింత పెట్టేలాగునయున్నూ అలాతోలని యెడల

సదరు మార్కెటు రేటుప్రకారం అయ్యేనష్టమున్ను అందుకు నె 1 కి నూటికి రు 1_0_0 చొ న వడ్డితో ఇచ్చేలాగున ప్రతివాది యిందుతో జతపర్చిన ది తేదీగల ప్రత్తిజట్టీని వ్రాయించియిచ్చినాడు.

II. సదరు జట్టి ఖరారు ప్రకారం దుందుభినామ సంవత్సర మాఖ బ 30 లకు సరియైన ది తేదీ వెళ్లిపోయినను, వాది కంపెనికి ప్రతివాది 40 పుట్ల ప్రత్తిని తోలక తప్పిపోయినాడు.

III. సదరు జట్టిఖరారు ప్రకారము ప్రత్తినితోలవలసిన వాయిదాఅగు దుంధుభినామ సం॥ మాఖ బ 30 లకు సరియైన ది తేదీన మార్కెటు రేట్ పుట్టి 1 కి రు 96_0_0 లు వుండి వున్నది. సదరు మార్కెటు రేటుప్రకారము వాదికంపెనీకి పు 1 కి రు 16_0_0 లు నష్టముకలిగినది. సదరు ప్రకారము 40 పుట్లకు రు 640_0_0 లు నష్టము వచ్చినది. సదరు నష్టమును వాదికంపెనీకి ప్రతివాది ఇచ్చుటకు బద్ధుడయి వున్నాడు.

IV. సదరు నష్టమునుగురించి వాది ప్రతివాదికి రిజష్టరీ వుత్తరంఇచ్చి తగాదా పర్చగా పేచీసంగతులతో జవాబుఇచ్చి నాడేకాని చెల్లుయేమీా ఇచ్చి వుండలేదు. సదరు జవాబులోని సంగతులువాస్తవమయినవిన్ని చెల్లతగినవిన్ని కావు.

V. సదరు నష్టముకు ఖరారు ప్రకారము నె 1 కి నూటికి రు 1_0_0 చొప్పున వడ్డిన్ని ఇచ్చుటకు బద్ధుడయివున్నాడు.

VI. వ్యాజ్యకారణం వాది కంపెనీకి ప్రతివాది జట్టివ్రాసి యిచ్చిన ది తేదీననున్ను జట్టి ప్రకారం ప్రత్తిని తోలవలసిన వాయిదా అగు దుందుభి నామసం॥ మాఖ బ 30 లకు సరియైన ది తేదీననున్నూ తమ డి॥ యిలాకా గుంటూరు గ్రామంలో కలిగినది.

4. దావా వివరం

| | |
|---|---|
| వాది కంపెనీకి ప్రతివాది యివ్వవలసిన నష్టము పుట్టి 1 కి రు 16_0_0 చొ న 40 పుట్లకు | 640_0_0 |

మొదలు వరకు నె 1 కి నూటికిరు 1-0-0 చొప్పున అయిన వడ్డి లకు స్టాంపుడ్యూటి రు. లు దాఖలు —————

5. కాబట్టి వాది తరపు విమర్శించి

ఎ. దావా మొత్తమున్ను

బి. దావా ఖర్చులున్ను

సి. దావా తేదీలగాయతు సొమ్ము ముట్టేవరకు నె 1 కి నూటికి రు 1_0_0 చొప్పున దరిమిలా వడ్డితో వాదికి ప్రతివాది ఇచ్చుకునే లాగున వాదిపక్షం డిక్రి ఇప్పించవలెననిని వాది ప్రార్థిస్తూయున్నాడు.

దివ్యచిత్తమునకు తేవలయును.

## 22 ఖాతానుబట్టివేసిన దావా.

మహారాజశ్రీ గుంటూరు పి॥ డి॥ మునసబుకోర్టువారికి.

అసలు /1924

పంతంగి రామయ్య— వాది

ఎదిరి.

శ్రీరాం చంద్రశేఖరం— ప్రతివాది

శి॥ ప్రొ॥ శె 26 ప్రకారం వాదిదావా.

1. వాదివివరం.

2. ప్రతివాదివివరం.

3. I. తమ డి॥ యిలాకా గుంటూరుగ్రామంలో వాదితాలూకు ఫ్యాక్టరీలో ప్రతివాది ది 14-6-21 తేదీలగాయతు ఖాతాయుంచి 20-8-23 ఆఖరువరకు బియ్యం వగయిరాలు వాడుకొనడమున్ను అందు మింజుమలె చెల్లులు యివ్వడమున్ను మూలముగా ఖాతా జరుపుకున్నాడు.

II. సదరు ఖాతాబాపతు ఇందుతోజతపరిచిన లెఖ్ఖప్రకారం వాదికి ప్రతివాది వడ్డీసహా రు. 600-0-0 లు బాకీతేలినాడు.

III. సదరు బాకీనిగురించి వాది ప్రతివాదికి రిజష్టరీ వుత్తరం ఇచ్చి తగాదాపరిచినను చెల్లు యేమీ యివ్వ



IV. సదరు ఖాతాకు వర్తకాచారప్రకారమున్ను ఖరారుప్రకారమున్ను నె 1కి నూటికి రు. 1-0-0 చొప్పున వడ్డీన్ని యిచ్చుటకు బద్ధుడయి వున్నాడు.

V. వ్యాజ్యకారణం దావాఖాతా ప్రారంభించిన డి 14-6-21 తేదీ లగాయతు యీసరికి 3 సంవత్సరములలో ... యుండే ప్రతి ఖర్చుపడ్డ తేదీనను తమ డి॥ యిలాకా గుంటూరు గ్రామంలో కలిగినది.

4. దావావివరం.

లెఖ్ఖప్రకారం బాకీ రు. 600-0-0

లకు స్టాంపుడ్యూటీ రు. దాఖలు.

5. కాబట్టి వాదితరఫు విమర్శించి

ఎ. దావామొత్తమున్ను, బి. దావాఖర్చులున్ను, సి. దావా తేదీలగాయతు సొమ్ముముట్టునంతవరకు నె 1కి నూటికి రు. 1-0-0 చొప్పున దరిమిలా వడ్డీతో వాదికి ప్రతివాది యిచ్చుకునేలాగున వాదిపక్షం డిక్రీ యిప్పించమని వాది ప్రార్థించుచున్నాడు.

దివ్యచిత్తమునకు తేవలెను.

## 23 రాజీనామాడిక్రీనిబట్టి వేసిన దావా

మహారాజశ్రీ గుంటూరు ప్రి॥ డి॥ మునసబు కోర్టువారికి.

అసలు /1924

భర్తిపూడి శేషయ్య— వాది

ఎదిరి.

భర్తిపూడి శీతారామయ్య— ప్రతివాది

శి॥ ప్రొ॥ శె 26 ప్రకారం వాదిదావా.

1. వాదివివరం.

2. ప్రతివాదివివరం.

3. తమ డి॥ యిలాకా గుంటూరు గ్రామంలో వాది ప్రతివాదులకు వారసత్వేన సంక్రమించిన భూమివిషయములో ప్రతివాది తమ కోర్టుఫయిలు అసలు 160/22 రున దావావేసి వాదినిన్ని ఇంకా కొంత మందినిన్ని సదరు దా లో ప్రతివాదులనుగా చేర్చి దావావేసినాడు.

సదరుదావాలో యీవాది అన్సరుదాఖలుచేసి కంటెస్టుచేయగా ప్రతి వాదిన్ని యీవాదిన్ని యింకా కొంతమందిన్ని రాజీపడి రాజీనామా పిటీషనువ్రాసి కోర్టులో దాఖలుచేసినారు సదరురాజీనామాప్రకారం కోర్టువారు ది 14_8_22 తేదీన డిక్రీదయచేయించినారు.

4. సదరు రాజీనామా డిక్రీప్రకారం వాదికిరావలసిన షెడ్యూలు దాఖలా 1, 2 అయిటముల భూమిన్ని షెడ్యూలు దాఖలాచరాస్తిన్ని వాదికి ప్రతివాది రాజీనామా డిక్రిఅయిన 3 మాసములలోగా డెలివరి చేయవలసి యున్నందుకు ప్రతివాది సకాలములో డెలివరి చేయనందున యీవాది ప్రతివాదిమీద తమకోర్టుద్వారా రాజీనామా డిక్రిప్రకారం యి.పి 124/23 రున వారంటు అమలు జరుపగా భూమిని స్వాధీనము కానివ్వక అడ్డుకలుగజేసినాడు. అదిన్నిగాక చరాస్తిని మరుగుపర్చి స్వాధీనము చేసియుండలేదు. అందుచేత యీవాది రాజీనామా డిక్రిప్రకారము ఎ షెడ్యూలు దాఖలా స్తిరాస్తియందున్నూ బి షెడ్యూలు దాఖలాచరాస్తి యందున్నూ వాదికిగలహక్కును స్థిరపరిపించి వాదికి స్వాధీనము చేయునిమిత్తం యీదావా దాఖలు చేయడమయినది.

5. వ్యాజ్యకారణం రాజీనామా డిక్రీపుట్టిన 14_8_22 తేదీన నున్ను వాది ప్రతివాదిమీద సదరు షెడ్యూళ్ళదాఖలా ఆస్తిపిష యమై వారంటు అమలు జరిపిన దరిమిలాను తమ డి॥ యిలాకా గుంటూరు గ్రామములో కలిగినది.

6. దావావివరం

రాజీనామా డిక్రీప్రకారం వాదికిప్రతివాది స్వాధీనపరచవలసిన ఎ,బి షెడ్యూళ్ళదాఖలా స్తిరచరాస్తులయందు వాదికిగల హక్కును స్థిరపరిపించి వాదికి స్వాధీనపరిపించగలందులకు రు. 15_0_0

విలువగల స్టాంపు దాఖలుచేయడమయినది.

జ్యూరిస్‌డిక్షన్ నిమిత్తం రు. 800_0_0

7. కాబట్టి కోర్టువారు విమర్శించి

1. ఎ, బి షెడ్యూళ్ల దాఖలా స్తిరచరాస్తులయందు వాదికిగల హక్కును స్తిరపరిపించి వాదికి స్వాధీనపరిపించవలెననిన్ని,

2. దావాఖర్చులున్ను,

3. ఇంకా కోర్టువారికి యుక్తమని న్యాయమని తోచే అన్ని యితర పరిహారములతో వాదిపక్షం డిక్రీయిప్పించవలెనని వాదిప్రార్థించుచున్నాడు.

దివ్యచిత్తమునకు తేవలయును.

ప్రమాణవచనం.

మకాం,
తేది

షరా:— షెడ్యూల్లు దాఖలు చేయవలయును.

## 24 బయానారశీదునుబట్టి దస్తావెజును వ్రాయించి యివ్వమని వేసిన దావా

మహారాజశ్రీ గుంటూరు ప్రి॥ డి॥ మునసబుకోర్టువారికి,

అసలు నెం. /1924

మన్నవ వెంకయ్య— వాది

ఎదిరి.

యడ్లపల్లి శీతయ్య— ప్రతివాది

శి॥ ప్రొ॥ శె 26 ప్రకారం వాదిదావా.

1. వాదివివరం.

2. ప్రతివాదివివరం.

3. తమ డి॥ యిలాకా గుంటూరుగ్రామములో షెడ్యూలు దాఖలా రు. 14_8_0 లు క్విటురెంటుగల యీనాంభూమిని వాదికి ప్రతివాది రు. 1200 లకు విక్రయించి క్రియధనంమింజుమలె గ. 100 లు బయానాక్రింద పుచ్చుకుని వారంరోజులలో సేషించిన రు. 100-0-0 గుంటూరుసబురిజిస్ట్రారువారియెదుట చెల్లించేలాగుననున్ను విక్రయ దస్తావేజు వ్రాయించి యిచ్చేలాగున మొదలగు షరతులతో వాదిపేర టికి ప్రతివాది ది 10_6_23 తేదిగల యిందుతో జతపర్చిన రశీదును వ్రాయించియిచ్చి సదరు తేదీననే షెడ్యూలుదాఖలాభూమిని స్వాధీన పరచినాడు.

4. సదరు రశీదును వ్రాయించిన వారంరోజులలోగా వాది బయానా సొమ్ము రు. 100 లు పోను శేషించిన రు. 1100 లు చెల్లి ప్రతివాదిని విక్రయదస్తావేజును వ్రాయించియివ్వవలసినదిగా కోరగా ప్రతివాది తనకు సుస్తీగావున్నదనిన్ని నెమ్మదించినతోడనే వచ్చి రిజష్ట్రు చేసియిస్తాననిన్ని మొదలగుమాటలు చెప్పినందున వాది నిజమని నమ్మి 10 రోజులువూరుకున్నాడు.

5. ఇంతలో వాది విరోధస్తుల శింగంపల్లి రామస్వామి వగైరాల దుస్సలహాలవల్ల ప్రతివాది అక్రమపు సంగతులతో రిజష్టరీచేయుటకు వీలులేదనిన్ని రశీదు ప్రకారము టయిము వెళ్ళిపోయినదనిన్ని మొదలగు సంగతులతో రిజష్టరీనోటీసు ఇచ్చినాడు. సదరు వుత్తరమునకు వాది సరియైన సంగతులతో జవాబు ఇస్తూ విక్రయ దస్తావేజును వ్రాయించి రిజష్టరీచేసి ఇవ్వవలసినదిగా కోరినను ప్రతివాది ఇంతవరకు విక్రయ దస్తావేజును వ్రాయించి రిజష్టరీచేయించి ఇచ్చివుండలేదు. వాది సదరు భూమికి రు 100 ల మరమత్తుకూడా చేయించి వున్నాడు.

6. వాదికి ప్రతివాది బయానారశీదు మగతు ప్రకారము విక్రయదస్తావేజు వ్రాయించి రిజష్టరీ చేయించి ఇచ్చుటకు యీదావా దాఖలుచేయడమైనది. ఒకవేళ కోర్టువారు దస్తావేజు వ్రాయించియిచ్చుటకు వీలులేదనియెంచే పక్షమును వాదికి ప్రతివాది విక్రయము మొత్తము క్రింద బయానా ఇచ్చిన రు 100 లకున్ను అందుకు నెల 1కి నూటికి రు 1 చొప్పున ఆచారప్రకారము వడ్డికిన్ని వాది సదరుభూమికి మరమ్మతు చేసిన బాపతు రు 100 లున్ను వాదికి కలిగిన నష్టమున్ను డిక్రీ దయచేయించవలసి యున్నది. దావా అస్తికి విక్రయ దస్తావేజు వ్రాయించి రిజష్టరు చేయించి యిచ్చుటకు ప్రతివాది బద్ధుడైవున్నాడు.

7. వ్యాజ్యకారణం పెద్యూలు దాఖలా దావా భూమికి వాదికి ప్రతివాది విక్రయించి బయాన పుచ్చుకుని రశీదు వ్రాసియిచ్చి భూమిని స్వాధీనపర్చిన ది 10_6_23 తేదీన తమ డి॥ యిలాకా గుంటూరు గ్రామంలో కలిగినది.

8. దావా వివరం.

విక్రయ మొత్తం 1200_0_0

లమీాద స్టాంపుడ్యూడీ రు లు దాఖలు చేయడమైనది.

కోర్టుఫీజు ఆక్టు శెక్షన్ 7 క్లాజ్ 10 ప్రకారము.

జ్యూరిస్ డిక్షన్ నిమిత్తం రు 1200 లు అయివున్నది.

9. కాబట్టి కోర్టువారు విమర్శించి.

1 దావా షెడ్యూలు దాఖలా స్థిరాస్తి వాదిపేరటికి ప్రతివాదివల్ల విక్రయదస్తావేజును వ్రాయించి యిప్పించమనిన్ని

2 దావా ఖర్చులు వాదికి ప్రతివాది యిచ్చుకునేలాగున నున్నూ

3 యేకారణము చేతనైనా విక్రయ దస్తావేజు వ్రాసియిచ్చుటకు వీలులేదని కోర్టువారు యెంచే పక్షముకు 6 పేరాలో వ్రాసిన ప్రకారము బయానాక్రింద ఇచ్చిన రు 100 లున్ను అందుకు నెల 1కి నూటికి రు 1 చొప్పున వడ్డిన్ని వాది సదరు భూమికి చేసిన మరమ్మతు బాపతు రు 100 లున్ను వాదికి కలిగిన నష్టముబాపతు రు100 లున్నూ వాదికి ప్రతివాది యిచ్చుకునేలాగుననున్ను.

4 ఇంకా యీవిషయమై కోర్టువారికి యుక్తమని న్యాయమని తోచే అన్ని ఇతర పరిహారములతో వాది పక్షం డిక్రీ ఇప్పించవలెనని వాది ప్రార్థించుచున్నాడు. దివ్యచిత్తమునకు తేవలయును.

దస్కతు

ప్రమాణ వచనం.

మకాం

తేది

షరా:— షెడ్యూలు దాఖలు చేయవలెను.

## 25 పరువునష్టముకు దావా

మహారాజశ్రీ గుంటూరు ప్రి॥ డి॥ మునసబుకోర్టువారికి.

అసలు /1924

మందడపు వెంకటేశ్వరరావు వాది

ఎదిరి.

శ్రీపతి జయరామయ్య ప్రతివాది

శి॥ ప్రొ॥ శె 26 ప్రకారం వాదిదావా.

1. వాదివివరం.

2. ప్రతివాదివివరం.

3. తమ డి॥ యిలాకా గుంటూరుగ్రామంలో వాదికి య 160 ల స్థిరాస్తిన్ని రు. 4000 ల చరాస్తిన్ని రు. 10000 లు విలువచేయు కొట్లున్ను వుండివున్నవి. ఇవిన్నిగాక వాది లాడమ్ట్రేడింగు అండుకో అను ఫరముకు కామందు అయివున్నాడు. సదరు ఫరముమీద రు. 100,000 ల వ్యాపారము జరుగుచున్నది. వాది గవర్నమెంటు వారికి రు. 1200 లు యిన్కంటాక్సు చెల్లించువాడయివున్నాడు. వాది గొప్పవంశీకుడున్ను మర్యాదకుటుంబమునకు చేరినవాడున్నుఅయివున్నాడు. వాది పెద్దతండ్రి గవర్నమెంటులో పెద్దవుద్యోగస్తుడున్ను వాది అన్నగారు బందరుజిల్లా డిప్యూటి కలెక్టరు పదవిలో వుండివున్నారు.

4 ఇట్టి స్థితిలో వాది ప్రతివాదిమీద లెఖ్ఖలను తెప్పించమని తమ కోర్టుఫయిలు అసలు 120/23 నుంబరు రు. 2000 లకు దావా దాఖలుచేసి వాదితాలూకు య. 160 భూమిన్ని రు. 4000 చరాస్తిన్ని రు. 10000 ల విలువగల కొట్లున్ను వాదిపేరుతో జరిగే లండను ట్రేడింగు అండుకో అను ఫరములోని సామానులున్ను వాది తాకట్టు విక్రయం మొదలగు అన్యాక్రాంతము చేయుచున్నాడని ఫాల్సు అఫిడవిట్టు ఇచ్చి 6 10-23 ఫయిలుజప్తుచేయించి గ్రామంలో టమటము వేయించినాడు. అందువలన వాదికి పరపతి నష్టమున్ను, మర్యాద భంగమున్ను కలిగినది,

5. వాదిమీద ప్రతివాది దావావేసినంతలో కోర్టువారు దయచేయించిన నోటీసుచూచుకుని ఖర్చులతోసహా దావామొత్తమును వాదికోర్టులో డిపాజిట్టుచేసినాడు.

6. వాది యెన్నడూ తనతాలూకు స్థిరచరాస్తులను యెవరికి యేవిధమయిన అన్యాక్రాంతముచు యిదివరకు చేసియుండలేదు. ఇక ముందు చేయుతలంచలేదు. ఆలాచేయవలసినఅగత్యము వాదికి యెంతమాత్రములేదు. అట్టిస్థితిలో వాదిని అల్లరిపుచ్చి వాదికి పరపతి నష్టము కలుగచేయవలయుననే దుష్టతలంపుతో అక్రమముగా ఫాల్సు అఫి

డవిట్టు ఇచ్చి ఫయిలుజప్తుచేయించినాడు. అందువలన వాదికి రు. 1000 లకు పరునష్టము కలిగినది. గనుక వాదికి ప్రతివాది పరపతినష్టము క్రింద రు. 1000 లు యిచ్చుటకు బద్ధుడయి వున్నాడు.

8. వాదిమీద ప్రతివాదివేసిన సదరు అసలు 120/23 దావాలో వాది ఆన్సరు దాఖలుచేసి వాదనజరుపుకున్న యెడల వాదికి ప్రతివాదే యింకా బాకీయుండును. ఆ స్థితిలో వాదితాలూకు స్థిరచరాస్తులను ప్రతివాదిజప్తుచేయుటకు హక్కు అధికారములు లేవు. వాది సదరు అసలు 120/23 దావాలో ఆన్సరు దాఖలుచేసియున్నాడు.

9. వ్యాజ్యకారణం వాదిమీద ప్రతివాది సదరు కోర్టుఫయిలు అసలు 120/23 రున దావావేసి వాది తాలూకు ఆస్తిని ఫయిలుజప్తు చేయించిన ది 6-10-23 తేదీన తమ డి॥ యిలాకా గుంటూరుగ్రామం లో కలిగినది.

10. దావావివరం.

వాదికి ప్రతివాదివలన కలిగిన పరువునష్టమును యివ్వవలసిన మొత్తము రు. 1000-0-0

లకు స్టాంపుడ్యూటీ రు. దాఖలు

11. కాబట్టి కోర్టువారు విమర్శించి

ఎ. దావామొత్తమున్ను, బి. దావాఖర్చులున్ను, సి. దావా తేదీలగాయతు సొమ్ముముట్టేవరకు నెలకి నూటికి రు. 1-0-0 చొప్పున వడ్డీతో వాదికి ప్రతివాదివలన యిప్పించవలెనని వాది ప్రార్థిస్తున్నాడు.

దివ్యచిత్తమునకు తేవలెను.

దస్కతు వాది

ప్రమాణవచనం.

మకాం, }
తేది. } దస్కతు వాది

## 26 పంచాయతీ తీర్పు ప్రకారం డిక్రీ యిప్పించవమని దావా.

మ॥ రా॥ శ్రీ గుంటూరు ప్రి॥ డి॥ మునసబ్ కోర్టువారికి.

స్మాల్ /1924

1 శ్రీరాం మంగమ్మ 2 యీ సత్యమ్మ మైనరుఅయినందున తల్లి నెక్స్టు ఫ్రెండు మంగమ్మ } వాదులు

ఎదిరి

జూలూరు రామయ్య ప్రతివాది

శి॥ ప్రొ॥ 2 షెడ్యూలు 20 పేరా ప్రకారం వాదులు దాఖలు చేసిన దావా.

1. వాదుల వివరం.

2. ప్రతివాది వివరం.

3. 1వ వాది ప్రతివాదికి భార్యయున్ను 2వ వాది కుమార్తె యున్ను అయివున్నది. ప్రతివాది వాదులను సరిగా పోషించక వేరే వివాహము చేసుకొని యుండుటచే భోజనముకు జరుగకపోవుటచేత వారి వ్యవహారములను ఫయిసలు చేయుటకు బాదరు జిల్లాకోర్టు ప్లీడరుగారగు శ్రీరాం రాఘవరావు పంతులుగారు వారి వాదులను విచారించి తీర్పుచెప్పుటకు 24-10-23 తేదీన పంచాయతీ ఖరారు నామాను వుభయవాదులు వ్రాయించి యిచ్చినారు.

4. సదరు ఖరారునామాను అనుసరించి సదరు పంచాయతీ దారుగారు వుభయవాదుల సాక్షులను విచారించి 20-10-23 తేదీన తీర్పును చెప్పియున్నారు. సదరు తీర్పు రు 10ల స్టాంపుమీద వ్రాయ బడినది. సదరు తీర్పుకు పంచాయతీదారుగారు వుభయవాదులను సమ నులుయిచ్చి వుభయ వాదులను దగ్గిరవుంచుకొని సదరు తీర్పును 23-8-23 తేదీన యిచ్చినారు. సదరు పంచాయతీ తీర్పు నకలును యిందుతో దాఖలు చేయడమైన.

5. సదరు వాదులకు ఇవ్వామనే మనోవృత్తిమొత్తమును తమ డి॥ గుంటూరు గ్రామంలోని షెడ్యూలు దాఖలా ఆస్తిని చార్జిగా ఇచ్చునట్లుగాకూడా తీర్పు చెప్పినారు.

6. సదరు తీర్పును కోర్టువారు విచారించి తీర్పుచెప్పి దాని ప్రకారం డిక్రీ దయచేయించ గలందులకు యీదావా దాఖలు చేయ డమయినది.

7. వ్యాజ్యకారణం పంచాయతీ తీర్పు పుట్టిన 23-8-23 తేదీన బందరులో కలిగినను, చార్జిగావుంచిన ఆస్తి తమ డి॥ యిలాకా గుంటూరు గ్రామంలోదయినందున ఈ కోర్టులో దాఖలు చేయడమైనది.

8. దావావివరం.

పంచాయతీ తీర్పుప్రకారం కోర్టువారు డిక్రీచేయించ గలందులకు దాఖలుచేసిన స్టాంపు రు 15-0-0 లు

9. కాబట్టి కోర్టువారు విమర్శించి.

1 పంచాయతీ తీర్పు ప్రకారం వాదులకు ప్రతివాది మనోవృత్తి యిచ్చేలాగుననున్నూ షెడ్యూలు దాఖలా భూమిని స్వంత మనోవృత్తికింద చార్జిగా వుంచేలాగునను‌న్నూ.

2 దావా ఖర్చులున్నూ.

3 యింకా యీ విషయమై కోర్టువారికి యుక్తమని న్యాయమని తోచే అన్ని యితర పరిహారములతో వాదిపక్షం డిక్రీ యిప్పించమని వాది ప్రార్థించుచున్నాడు.

దివ్యచిత్తమునకు తేవలయును.

దస్కతు.

ప్రమాణ వచనం.

మకాం

తేది

షరా:— షెడ్యూలు దాఖలు చేయవలయును.

## 27 దత్తస్వీకారపత్రమునుబట్టిదావా

మహారాజశ్రీ గుంటూరు ప్రి॥ డి॥ మునసబుకోర్టువారికి.

అసలు /1924

మానేపల్లి వెంకటపతి—వాది

ఎదిరి.

1. మానేపల్లి రాఘువయ్య } ప్రతివాదులు.
2. యీ మంగయ్య }

శి॥ ప్రొ॥ శె॥ 26 ప్రకారం వాది దావా.

1. వాది వివరం.

2. ప్రతివాది వివరం.

3. తమ డి॥ యిలాకా గుంటూరు గ్రామంలో ప్రతివాదికి పుత్రపుత్రికా సంతానం లేక వాదిని దత్తతు చేసికొని దత్తతు కాలమందు ప్రతివాది యిందుతో జతపర్చిన 14-6-1900 తేదీ గల దత్త స్వీకార పత్రికను వ్రాయించి యిచ్చినాడు.

4. తదాది వాది ప్రతివాదుల యింటిలోనే వుంటూవున్నాడు. తరువాత కొన్నాళ్ళకు 1 ప్రతివాదికి 2 ప్రతివాది 20-8-18 తేదీన కలిగినాడు. 1 ప్రతివాదికి 2 ప్రతివాది కలిగినతరువాత 1 ప్రతివాదికిన్ని వాదికి దత్తుతల్లిన్ని 1 ప్రతివాదికి భార్యయున్ను 2 ప్రతివాదికి జనక తల్లిన్ని అయిన సుబ్బమ్మగారికిన్ని వాదియందు అసూయత కలిగి చూచి జూడనట్లు కొంతకాలము గడపి రానురాను వేళకు భోజనము పెట్టక తిట్టుతూ, కొట్టుతూ అనరాని దుర్భాషలాడుచూ ప్రేమ లేక నిరసించుచు చిట్టచివరకు ఇంటిలోనుండి వెళ్ళిపొమ్మని 10-10-1919 తేదీన వెళ్ళగొట్టినారు.

5. తరువాత వాది యేమిచేయుటకును తోచకనున్ను భోజనం పెట్టువారు లేకనున్నూ చాలా కష్టపడుతూ అలాగే దత్తుతండ్రిఅయిన 1 ప్రతివాది యింటిలో 1, 2 రోజులు ఆహారము లేకనే వుండగా ప్రతివాదులున్ను వాది దత్తుతల్లి అయిన సుబ్బమ్మగారున్నూ యేమాత్రమున్ను కనికరింపక యింటిలోనికి సహితము రానివ్వక వాదిని వెళ్ళగొట్టినారు.

6. వాదికి అతికష్టములు సంభవించిన దరిమిలాను వాది వుండుటకు వీలులేక జనక తండ్రిగారి యింటికి చేరినాడు. పెద్దమనుష్యుల చేత చెప్పించినను ప్రతివాదులు చెవినిబెట్టలేదు. అందుచేత వాది ప్రతివాదులకు తనభాగం పంచి యివ్వవలసినదని రిజష్టరు వుత్తరం యివ్వగా ప్రతివాదులు పేచీ సంగతులతో జవాబు యిచ్చినారేగాని భాగము పంచి యివ్వలేదు. ప్రతివాదులు యిచ్చిన జవాబులోని సంగతులు న్యాయమైనవిన్ని చెల్లతగినవిన్ని కావు.

7. వాదిప్రతివాదులకు గుంటూరుగ్రామంలో ఏ షెడ్యూలు దాఖలా య 42 లభూమిన్ని బి షెడ్యూలుదాఖలా రు. 2400 లు

విలువగల చరాస్తిన్ని వుంచుకున్నది. సి షెడ్యూలు దాఖలా లోకులవల్ల రు 1000 లు రావలసియున్నవి. లోకులకు యేమీ బాకీలేదు.

8. సదరు ఎ షెడ్యూలు దాఖలా స్తిరాస్తిని 3 సమాన భాగములు చేయించి వాదికి 1/3 వంతు. స్తిరాస్తిన్ని బి షెడ్యూలు దాఖలా చరాస్తిని 3 సమాన భాగములు చేయించి వాదికి 1/3 వంతు చరాస్తిగాని దాని ఖరీదుగాని. సి షెడ్యూలు దాఖలా లోకులవల్ల రావలసిన బాకీలను 3 సమాన భాగముల చేయించి వాదికి 1/3వంతు బాకీలు యిప్పించగలందులకున్నూ యీదావా దాఖలుచేయడమైనది.

9. వ్యాజ్యకారణం వాదికి 1 ప్రతివాది ధత్తస్వీకార పత్రము వ్రాసి యిచ్చిన 14_6_1900 తేదీనను వాదిని యింటిలోనుండి వెళ్ళగొట్టిన 10_10_19 తేదీనను వాది ప్రతివాదులకు రిజష్టరీ వుత్తరము యిచ్చిన దరిమిలాను తమ జి॥ యిలాకా గుంటూరు గ్రామంలో కలిగినది.

10. దావావివరం.

ఎ షెడ్యూలుదాఖలా స్తిరాస్తిని 3 సమభాగములుచేయించి వాదివంతు 1/3 భాగమును వాదికి స్వాధీనపరిపించగలందులకున్ను వాది భాగము కిమ్మతు రు. 1400-0-0

బి షెడ్యూలుదాఖలా చరాస్తిని 3 సమభాగములుచేయించి వాదివంతు1/3 భాగము చరాస్తిగాని దానిఖరీదుగాని స్వాధీనపరిపించగలందులకు వాదిభాగము కిమ్మతు రు. 800-0-0

సి షెడ్యూలుదాఖలా లోకులవలనరావలసిన బాకీలు 3 సమభాగములుచేయించి వాదికి రావలసిన 1/3 భాగముకిమ్మతు రు.333-5-4

రు. 2533-5-4

లకు స్టాంపుడ్యూటీ రు. దాఖలుచేయడమయినది.

11. కాబట్టి కోర్టువారు కరుణించి

1. ఎ షెడ్యూలుదాఖలా స్తిరాస్తిని 3 సమభాగములుచేయించి వాది 1/3 వంతుభాగమును వాదికి స్వాధీనపరిపించవలెననిన్ని,

2. బి షెడ్యూలుదాఖలా చరాస్తిని 3 సమభాగములుచేయించి వాది 1/3 వంతుభాగమును వాదికి స్వాధీనపరిపించవలెననిన్ని,

3. సి షెడ్యూలుదాఖలా లోకులవలన రావలసినబాకీలు 3 సమ భాగములుచేయించి వాది 1/3 వంతురావలసిన బాకీలను వాదికి స్వాధీనపరిపించవలెననిన్ని,

4. దావాఖర్చులున్ను,

5. ఇంకా కోర్టువారికి యుక్తమని న్యాయమనితోచే అన్ని ఇతరపరిహారములతో వాదిపక్షం డిక్రీ యిప్పించవలెనని వాది ప్రార్థించుచున్నాడు.

దివ్యచిత్తమునకు తేవలయును.

ప్రమాణవచనం.

షరా:—షెడ్యూళ్లు దాఖలుచేయవలయును.

## 28 యిన్సాల్వెన్సీ పిటీషన్.

మ॥ రా॥ శ్రీ॥ గుంటూరు ప్రి॥ డి॥ మునసబు కోర్టువారికి.

ఇం. డి. కో. 1924.

చలవపందిళ్ళ నాగయ్య పిటీషనరు

ఎదిరి.

విశ్వనాథుని వీరయ్య అండ్ 20 అదర్సు క్రిడిటర్సు

యిన్సాల్వెన్సి యాక్టు V ఆఫ్ 1920 అండర్ సెక్షన్ 6 అండ్ 10 అండ్ 11 ప్రకారం పిటీషనరు త॥ దాఖలుచేసిన పిటీషన్.

1 పిటీషనరు వివరం.

2 క్రిడిటర్ల వివరం.

3. ఎ షెడ్యూలు దాఖలా పిటీషనరు లోకులకు రు 2060లు బాకీతేలినాడు. బి 1 షెడ్యూలు దాఖలా రు 1000 లున్నూ బి 5 షెడ్యూలు దాఖలా రు 8 లున్ను జుమలా రు 1008లు ఆస్తిమాత్రం వుండివున్నది.

4. పిటీషనరుచేసిన మిర్చి వ్యాపారములో నష్టమువచ్చినది. బాకీదార్లయొక్క వడ్డీలు చాలాయెక్కువ అగుటవల్లనున్నూ పిటీషనరు తీర్చుటకు వీలులేకపోయినది.

5. పిటీషనరు బాకీదార్లను దామాషాగా తీసుకోవలసినదని ప్రార్థించినను నిరాకరించినందున యీపిటీషన్ దాఖలు చేయడమైనది.

6. బాకీదార్లలో ఒకడైన 14 క్రిడిటరు పొందూరు అచ్చయ్య గుంటూరు అ॥ డి॥ మునసబుకోర్టు ఫయిల్ స్మాలుకాజు 100/23 రును దావావేసి డిక్రీపొంది యి. పి. 140/23 అమలుజరిపించి పిటీషనరు తాలూకు బి షెడ్యూలుదాఖలా స్థిరాస్తిని వేలముకుతెచ్చినాడు. సదరువేలం 10-4-24 తేదీన అయివున్నది. వేలం అయ్యేయెడల అందరు బాకీదార్లకు దామాసారాక పిటీషనరుకు చాలా నష్టము కలుగును. కాబట్టి వేలము ఆపుట అవుసరము.

7. యీఆస్తిని కోర్టువారి స్వాధీనములో వుంచుటకు సిద్ధముగా వున్నాడు.

8. యిదే ప్రథమపిటీషన్. ఇదివరకు పిటీషన్ దాఖలుచేసియుండలేదు.

9. పిటీషనరు బాకీలను తీర్చుటకు శక్తిలేదు. అందువల్ల యీ పిటీషన్ దాఖలుచేయడమైనది.

కాబట్టి కోర్టువారు కరుణించి

1 యీ పిటీషనరును యిన్‌సాల్వెంటుగా డిక్లేరుచేయించుటకున్నూ.

2 యింకా కోర్టువారికి యుక్తమని న్యాయమనితోచేఅన్ని ఇతర పరిహారములతో పిటీషనరు పిటీషను యెడ్జ్యూడికేట్ చేయించవలెనన్ని పిటీషనరు ప్రార్థిస్తున్నాడు,

దివ్యచిత్తముకు తేవలయును.

షరా:—

ఎ షెడ్యూలు లోకులకు ఇవ్వవలసిన బాకీల జాబితా.

బి 1 పిటీషనరుగల ఇండ్లు పొలములు.

బి 2 లోకులవల్ల రావలసిన బాకీలు.

బి 3 సెక్యూరిటీలు షేర్లు.

బి 4 పైకము.

బి 5 చరాస్తి.

యీ అయిదు షెడ్యూల్లు పిటీషన్‌తో దాఖలు చేయవలెను. పిటీషన్ చివరను యీ క్రింది విధముగా తయారుచేసి దాఖలుచేయవలెను.

ప్రతి షెడ్యూలుకు ప్రమాణవచనము ఉండవలెను.

పిటీషన్ ఆఖరునకూడా ప్రమాణవచనము వుండవలెను.

పార్టి సంతకము వుండవలెను.

| | | |
|---|---|---|
| ఎ లైబిలుటీలు | | 2060_0_0 |
| షెడ్యూలు బి భూమి, ఇల్లు | 1000_0_0 | |
| బి 2 బాకీ | 0_0_0 | |
| బి. 3 సెక్యూరిటి మరియు షేర్లు | 0_0_0 | 1008_0_0 |
| బి 4 డబ్బు | 0_0_0 | |
| బి 5 ఇతర చరాస్తి | 8_0_0 | |
| డెఫిషియన్సీ | | 1052_0_0 |

## 29 సెటిలుమెంటుదస్తావేజునుబట్టిదావా

శి॥ ప్రో॥ శె 26 ప్రకారము వాదులదావా.

1. వాదులవివరం.

2. ప్రతివాదుల వివరం.

3. 2ప్రతివాదితండ్రి 1. ముత్యాలున్ను, 2. సుబ్బారాయుడున్ను 3. బాలకోటియున్ను, 4. పానకాలున్ను, వీరప్పకుమాళ్లున్ను. 1వాది సదరువీరప్పకుమార్తెయున్నూ 2వ వాది కుమార్తెకుమారుడున్నూ అనగా 1వాదికి కుమారుడున్ను అయివున్నాడు. తండ్రి కుమాళ్లు పంచుకునేకాలమందు నిడమర్రు గ్రామంలోని డి॥ నె 154 రు రు. 18_7_0 లు శిస్తుగల య. 9_84 శెంట్లభూమికిని తండ్రి వీరప్ప మనోవర్తిక్రింద ఇచ్చినారు. వీరప్పభార్య చనిపోయినందున సదరువీరప్ప వాదులదగ్గరనేవుంటూ 1, 2 వాదులచేత జిరాయితి వగయిరాలు చేయించుకుంటూ షుమారు 25 సంవత్సరములక్రింద చనిపోయినాడు.

4. చనిపోయేకాలమందు తన కుమారులను పిలిపించి తన మనోవర్తితాలూకు య 9_84 శెంట్లలో సఖం వాదులకున్ను తతిమ్మా సఖం తన కుమారుడుఅయిన బాలకోటికిన్ని ఇవ్వవలసినదని కోరినాడు.

దానికి వారందరు వొప్పుకొనియున్నారు. సదరు వీరప్ప చనిపోయినది లగాయతు యిప్పటివరకు సదరు పొలము పంపిణీచేసుకుని తూర్పు భాగం వాదులున్నూ పడమటిభాగం బాలకోటియున్ను అనుభవిస్తూ వచ్చినారు. అందువలననున్నూ యడ్వర్సు పొజిషన్ వలననున్నూ పయిప్రకారమువలననున్నూ హక్కు కలిగినది.

5. దరిమిలాను అన్నదమ్ములలో తగాదావచ్చి వారు భాగములవిషయములో ఫయిసలుచేసుకొను సందర్భములో 1-9-1908 తేదీన వీరప్పకుమాళ్ళు బాలకోటి అతనికుమారుడు ఆంజనేయులు, డిటో సుబ్బారాయుడు యితనికుమారుడు గోపాలస్వామి, ముత్యాలుకుమారుడు 2 ప్రతివాదిన్ని రాజీపడి సెటిలుమెంటు దస్తావేజును వ్రాసుకున్నారు. దానిలో వీరప్పయిష్టప్రకారం ఆయన కాలంచేసినదిలగాయతు వాదుల స్వాధీనభుక్తములోవున్న డి॥ నె 154 రు రు. 18-2-0 ల శిస్తుగల య. 9-84 శెంట్ల మింజుమలె తూర్పు పంపు య. 4-92 శెంట్లు వాదులయొక్క హక్కును వప్పుకొని వీలువెంబడి సరియయిన సెటిలుమెంటు దస్తావేజును వ్రాసుకొన్నారు. తదాది సదరు భూమి వాదుల స్వాధీనానుభవములోనే వున్నది.

6. అయితే 2 ప్రతివాది వాదులకుయెంతమాత్రము తెలియకుండానున్నూ దగాగానున్నూ 1 ప్రతివాదిపేరటికి 10-1-20 తేదీన రు.400 లకు తాకట్టుదస్తావేజు వ్రాసియుస్తూ దగాతలంపుతో 1, 2 ప్రతివాదులు ఏకమయి వాదుల హక్కుభుక్తములుగల షెడ్యూలుదాఖలా భూమిని కూడా తాకట్టు పెట్టినట్టున్ను 2 ప్రతివాదిమీద 1 ప్రతివాది తమ కోర్టుఫయిలు స్మాల్ 100/19 రున సింపిల్ మనీడిక్రీ ని పొంది దానిని బట్టి అసలు 839/22 నెంబరు పిటీషన్‌ద్వారా అమలు జరిపిస్తూ షెడ్యూలుదాఖలా భూమినిన్ని 2 ప్రతివాదితాలూకు యితర భూమి నిన్ని జప్తుచేయించి వేలముకు తీసుకొనివచ్చినట్టున్ను 29-1-24 తేదీని వేలంవాయిదాఅయినట్టున్ను ఇప్పటికి షుమారు నాలుగురోజులక్రిందట తెలిసినది. వాదులది కాపురమువుండుగ్రామము భూమిగ్రామమగునిడమర్రు కాకపోవుటచేత 1, 2 ప్రతివాదులు లాలూచీఅయి వాదులకు జప్తు వగయిరాల విషయమై తెలియకుండా చేసినారు.

7. షుమారు 25 సంవత్సరముల పయికాలమునుంచి సదరు షెడ్యూలుదాఖలా పొలము వాదులస్వాధీనభుక్తములలో వుండుట చేత పయినవుదహరించిన తాకట్టుగాని స్మాల్ 100/19 830/22 రు డిక్రిబాకీగాని వాదులహక్కునునిరోధించజాలదు. సదరు స్మాల్ 100/19 830/22తో జరిగేవేలమున్ను యీ వాదుల హక్కుకు భంగము కలిగించజాలదు. వాదులకు హక్కు భుక్తములుగల షెడ్యూలు దాఖలా భూమిని 1 ప్రతివాదికి 2 ప్రతివాది లాలూచీగా తాకట్టుపెట్టి నను అది లా ప్రకారము చెల్లనేరదు. వాదులభూమిని అపహరించి అక్రమపులాభములపొందవలయుననే దురుద్దేశ్యముతో 1, 2 ప్రతివాదులు ఏకమయి వాదులకు తెలియకుండా ఫ్రాడ్యులెంటుగా 2 మొదలు 5 ప్రతివాదులు 1 ప్రతివాదికి తాకట్టుపెట్టినారేకాని యితరంకాదు.

8. కాబట్టి సదరు భూమియందు వాదులహక్కును స్థిరపరిపించి సదరు 10-1-20 తేదీన 2 మొదలు 5 ప్రతివాదులు 1వ ప్రతివాదికి రు. 400 లకుగాను వ్రాయించియిచ్చిన తాకట్టు దస్తావేజుగాని తమ కోర్టు ఫయిలు స్మాల్ 100/19 రున 1 ప్రతివాది 2 ప్రతివాది వగయిరాలమీద పొందిన సింపిల్‌మనీడిక్రీ గాని దానినిబట్టి వేలంవేయించుటకు 1 ప్రతివాదికి హక్కులేదని స్థిరపరిపించుటకున్ను తాకట్టునుబట్టి గాని స్మాల్ 100/19 830/22 రులో జరిగించుతూవున్న వేలము మొదలయిన పనులు ప్రతివాదులు జరిగించకుండా వుండగలందులకు పర్మినెంటు యింజక్షనుకున్నూ యీదావా దాఖలు చేయడమయినది.

9. వ్యాజ్యకారణం షెడ్యూలుదాఖలాభూమినివాదులహక్కును నిరోధించుటకు 2 మొదలు 5 ప్రతివాదులుపెట్టిన తాకట్టుదస్తావేజు సంగతిన్ని స్మాలు 100/19 830/22 రున అములుజరిగించి 29-1-24 తేదీకి వేలమును తెప్పించినట్టు యీవాదులకు తెలిసిన ఇప్పటికి షుమారు 4 రోజులక్రిందట తమ డి॥ యిలాకా మంగళగిరిగ్రామంలో కలిగినది.

10. దావావివరం.

షెడ్యూలుదాఖలాభూమియందు వాదులహక్కును స్థిరపరిపించి 2 మొదలు 5 ప్రతివాదులు 1 ప్రతివాదికి దగాగా సదరుభూమిని తనఖాపెట్టిన ఆడుమానమున్ను తమ కోర్టుఫయిలు స్మాలు 100/19

రున 1 ప్రతివాది 2 ప్రతివాది వగయిరాలమీద పొందిన డిక్రీగాని దానివలన 1 ప్రతివాది చేయుచున్న వేలంవగయిరాలు ఎగ్జిక్యూషన్ గాని వాదులహక్కును నిరోధించజాలదు. డిక్లేరుచేయుటకున్ను సదరు ప్రకారం వాటినిబట్టి అమలుజరుపకుండ వుండగలందులకు పర్మినెంటు ఇన్జక్షను కిమ్మతు రు. 20-0-0
లకు స్టాంపుడ్యూటీ రు. లు దాఖలు.

11. కాబట్టి కోర్టువారు విమర్శించి.

1. దావాషెడ్యూలుదాఖలా భూమియందు వాదుల హక్కును స్థిరపరిపించి 2 మొదలు 5 ప్రతివాదులు 1 ప్రతివాదిపేరటికి సదరు భూమిని తనఖా పెట్టివ్రాసియిచ్చిన దస్తావేజు వాదులహక్కుకు భిన్నముగా చెల్లదనిన్ని తమ కోర్టుఫయిలు స్మాలు 100/19 రులో పొందిన సింపిల్మనిడిక్రీ సదరు హక్కును నిరోధించజాలదనిన్ని డిక్లేరు చేయించవలెననిన్ని,

2. సదరు సింపిల్మనిడిక్రీని బట్టి 830/22 రులో జరిగించుతూవున్న యెగ్జిక్యూషన్ ప్రొసీడింగ్సు వేలము వగయిరాలు తాకట్టునుబట్టి అమలుజరిగించకుండా పర్మనెంటు ఇంజక్షను ఇప్పించవలెననిన్ని,

3. దావాఖర్చులున్ను,

4. ఇంకా యీవిషయమై కోర్టువారికి యుక్తమని న్యాయమని తోచే అన్ని యితర పరిహారములతో వాదిపక్షం డిక్రీయిప్పించవలెనని వాది ప్రార్థించుచున్నాడు.

దివ్యచిత్తమునకు తేవలయును.

షరా:—షెడ్యూలు దాఖలుచేయవలయును.

## 30 దానముఇచ్చిన భూమికి దస్తావేజువ్రాయించి యివ్వమని దావా.

1. వాదివివరం 2. ప్రతివాది వివరం

3. తమ డి॥ యిలాకా గుంటూరు గ్రామంలో వాది ప్రతివాది ఇంటిలో షుమారు 20 సంవత్సరములనుంచి పౌరోహితుడుగా వుండి శుభా శుభకార్యముల అన్నియు నెరవేర్చుచూ యుంటూయున్నాడు.

4. ఇట్లుండగా ప్రతివాదితల్లి అయిన భూదేవమ్మ 14-10-23 తేదీన పరలోక గతురాలయినది. ఆమెయొక్క ఉత్తర క్రియలు వాది యథావిధిగా జేయించినాడు. ఉత్తరక్రియలు చేయించు కాలమందు చనిపోయిన 12 వ రోజు అనగా 25-10-23 తేదీన గోదానము భూదానము, సువర్ణదానము, మొదలుగాగల దానములు చేయుటకు హిందూశాస్త్ర ప్రకారము ఆచారమైయున్నది. సదరు ఆచారప్రకారము ప్రతివాది వాదికి గోదానమున్నూ, సువర్ణదానమున్నూ గుంటూరు కొత్తపేటలో విష్ణాలయమునకు సామీప్యమున వున్న x 800 ల చతురగజములు గలగిన ఖాళీస్థలము భూదానముక్రిందనున్నూ ధారాగ్రహితముగా మధ్యవర్తులయెదుట నీళ్ళు వదలినాడు.

5. సదరు గోదానమున్నూ సువర్ణదానమున్నూ వాదికి అప్పుడే స్వాధీనముచేసి భూదానము విషయమై క్రతువు సంపూర్ణముగా వెళ్ళినతరువాత సదరు భూమికి క్రమమైన దస్తావేజు వ్రాయించి యిస్తానని సదరు పెద్దమనుష్యుల యెదుటనే చెప్పినాడు. అందుకువాది హర్షించి వూరుకున్నాడు.

6. క్రతువు అంతయు వెళ్ళిపోయిన దరిమిలాను వాది ప్రతివాదిని సదరు దానముచేయబడిన దావా షెడ్యూలు దాఖలా x 800 ల భూమికి క్రమమైన దస్తావేజు వ్రాయించి యివ్వవలసినదిగా కోరగా నీకు నేను అసలు దానముక్రింద భూమిని ఇవ్వలేదనిన్ని భూదానము చేయుటకు నేనంత మోతుబరినా అనిన్ని మొదలగు పేచీ సంగతులు మాట్లాడుతూ రాగా వాది భూదానముచేయు కాలమందు వున్న పెద్దమనుష్యులను విచారించి, రిజష్టరీ వుత్తరము ఇవ్వగా పేచీసంగతులతోనే జవాబు ఇచ్చినాడు. సదరు జవాబులోని సంగతులు న్యాయమైనవిన్ని చెల్లతగినవి కావు.

7. సదరు దానము చేయబడినటువంటి దావా షెడ్యూలు దాఖలా భూమి 800 గజములు రు 800 లు కిమ్మతు చేయునదై యున్నది. సదరు భూమికి ప్రతివాదివల్ల వాదికి విక్రయ దస్తావేజు వ్రాయించి యిప్పించుటకు యీదావా దాఖలు చేయబడమైనది. ఒక వేళ కోర్టువారు విక్రయదస్తావేజు వ్రాయించి యిప్పించుటకు వీలుకా

దని యెంచే పక్షముకు ఖరారుప్రకారము భూమి విలువ రు 800 లు వాదికి ప్రతివాది యిచ్చుకునే లాగున డిక్రీ దయచేయుంచవలసి వున్నది.

8. వ్యాజ్యకారణం దావా షెడ్యూలు దాఖలాభూమిని వాదికి ప్రతివాది తల్లి ఉత్తరక్రియలు చేయించినందుకుగాను భూదానముక్రింద ధారాగ్రహీతముగా నీళ్ళువదలిన 25-10-23 తేదీననున్నూ వాది ప్రతివాది సదరుభూమి విక్రయ దస్తావేజు విషయమై రిజష్టరు వుత్తరం ఇచ్చిన దరిమిలాను తమ డి॥ యిలాకా గుంటూరు గ్రామములో కలిగినది.

9. దావా వివరం.

షెడ్యూలు దాఖలా భూమికిమ్మతు 800-0-0

లకు స్టాంపుడ్యూటీ రు లు దాఖలు

కోర్టుఫీజు ఆక్టు శే॥ 7 క్లాజు 10 ప్రకారం

జ్యూరిస్ డిక్షన్ నిమిత్తం రు 800 లు.

10. కాబట్టి వాదితరపు విమర్శించి

1 వాదికి ప్రతివాదివల్ల షెడ్యూలు దాఖలాభూమికి క్రమమైన దస్తావేజు వ్రాయించి యిప్పించమనిన్ని

2 ఒకవేళ కోర్టువారు విక్రయదస్తావేజు వ్రాయించియిప్పించుటకు వీలుకాదని యెంచేపక్షముకు భూమి కిమ్మతు రు 800 లు వాదికి ప్రతివాదివల్ల యిప్పించమనిన్ని.

3 దావా ఖర్చులున్ను

4 ఇంకా యీవిషయమై కోర్టువారికి యుక్తమని న్యాయమని తోచే అన్ని ఇతర పరిహారములతో వాదిపక్షం డిక్రీ ఇప్పించమని వాది ప్రార్థిస్తున్నాడు.

షరా:— షెడ్యూలు దాఖలు చేయవలెను.

(ప్రధమభాగము సంపూర్ణము.)





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA125B183 |
| పుస్తకం పేరు | సివిల్ క్రిమినల్ రివిమ్యూ వ్యవహార మమతల బిసంగి 1 |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 109 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rakshana |
| పేజీలు విడదీసినది | Rukshana |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good. |